12.7.1996 శుక్రవారం 10 పేజీలు సంపుటి:68 సంచిక:28 విడిప్రతి రూ.2.00లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



# తెలుగుదేశం రైతును దగా చేస్తోంది

అల్‌మట్టి డ్యాం నిర్మాణం విషయంలో ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు చెప్పే మాటలకు, చేసే చేతలకు, పొంతన కన్పడడం లేదు. కర్ణాటక రాష్ట్రం కృష్ణా నదిపై నిర్మిస్తున్న ఈ ఆనకట్ట రాష్ట్ర ప్రయోజనాలకు తీరని అపకారం చేస్తుందని ఒప్పుకొంటూనే దేవగౌడ ఈ విషయంలో చేసే తప్పుడు వాగ్దానాలను విశ్వసిస్తున్నా రాయన.

డ్యాం విషయంలో జరుగనున్న ప్రమాదాన్ని ప్రజలకు తెలియ జేసి, ఉద్యమానికి అంకురార్పణ చేయడానికి సిపిఎం నాయకుడు శ్రీ పి. జనార్దన రెడ్డి నడుం కొట్టే వరకు ముఖ్యమంత్రి ఈ విషయం పట్టించు కోనేలేదు. జనార్దన రెడ్డి హైదరాబాదు నుంచి పత్రికల వారిని ఆల్‌మట్టికి తీసుకు వెళ్ళి, వాస్తవ పరిస్థితిని వివరించడంతో ఒక్కసారిగా రాష్ట్రం కలమేలు కున్నది. దానితో ముఖ్యమంత్రి ఉలిక్కి పడ్డారు. ప్రధాన మంత్రి దేవగౌడను కలిసి మాట్లాడినట్లు, ఆల్‌మట్టి నిర్మించి నప్పటికీ తమకు కేటాయించిన నీటి కంటే అదనంగా ఒక్క బొట్టు సైతం తాము వాడుకోమని దేవగౌడ హామీ ఇచ్చినట్లు చంద్ర బాబు ప్రకటించారు.

చేయడానికి వీలుగా నిర్మించే ఈ బృహత్ జలాశయం కృష్ణా నది వరద నీటినంతటినీ అగస్త్య మహర్షి వలె మింగివేస్తుంది. జూన్‌లో వర్షాలకు వచ్చే నీరు ఒక్క బొట్టు దిగువకు ప్రవహించదు. ఆ జలాశయం పూర్తి పరిమాణం నిండడానికి కనీసం 45

ఎలక్ట్రిక్ కేంద్రం ద్వారా విద్యుత్ ఉత్పత్తి చేసుకోవడం కర్ణాటక లక్ష్యం. దానితో వారు ప్రవాహాన్ని నియంత్రించి, తమ విద్యుత్ కేంద్రాలు పనిచేయ డానికి అవసరమైన పరిమాణంలోనే నీటిని విడుదల చేస్తారు. దీని వల్ల మన రిజర్వాయర్లకు వరద అన్నది వుండదు.

చేయలేము. విద్యుత్ ఉత్పత్తికి అనుగుణంగా నీరు వాడుకోవా లంటే కృష్ణా ఆయకట్టులో పైరుకు ఆగస్టు వరకు నీరు ఇవ్వడం వీలుకాదు. విద్యుత్‌కు వాడి, పైరుకు వదలా లంటే కనీసం మూడు నెలలు ఆలస్యం జరుగు తుంది. ఆల్‌మట్టి డ్యాం నిండడానికి ఒకటిన్నర నెల; ఆ తర్వాత వారు కొద్ది కొద్దిగా వదిలే నీటితో శ్రీశైలం నింపడానికి మరొక ఒకటిన్నర నెల వ్యవధి తప్పదని నిపుణుల అంచనా.

## దేవగౌడతో మొగమాటంతో ఆల్‌మట్టిపై దొంగ హామీలు

అసలు కీలకమంతా ఈ ప్రకటనలోనే వుంది. ఆల్‌మట్టి డ్యాం వల్ల కర్ణాటక అదనపు జలాలను వాడుకొన్నా, వాడుకోక పోయినా కృష్ణ నీరు దిగువకు ప్రవహించ నివ్వకుండా అడ్డుకొనే అవకాశం వారికి ఏర్పడు తుంది. ఇంచు మించు రెండు వందల డెబ్బయ్ టిఎంసిల నీరు నిల్వ

రోజుల ప్రవాహం అవసరమని నిపుణుల అంచనా." వారు డ్యాంను పూర్తిగా నింపుకొని, ఆ తర్వాత దిగువకు వదలడం ప్రారంభిస్తారు. దీని వల్ల ఆంధ్రలోని శ్రీశైలం, నాగుర్జున సాగర్, ప్రకాశం బ్యారేజిలకు ఆగస్టు మొదటి వారానికి కాని నీరు రాదు. దిగువకు నీరు వదిలే సమయంలో డ్యాంలోని హైడ్రో

కొద్ది కొద్దిగా నీరు రావడం వల్ల ఇనుకలో ఇనుకుడు, ఆవిరి కావడం వంటి నష్టాలు అధికమౌతాయి. పై పెచ్చు శ్రీశైలం రిజర్వాయర్‌లో పూర్తి స్థాయి నీటి మట్టం వస్తే తప్ప విద్యుత్ యంత్రాలు పనిచేయవు. కరెంట్ కోతతో సతమతమయ్యే మనం ఆ భారీ జల విద్యుత్ కేంద్రం విద్యుత్‌ను త్యాగం

కర్ణాటక రాష్ట్రం ఎంతో తెలివిగా చేస్తున్న మోసం ఇది. మన వాటా జలాలు మనకు వదలి నప్పటికీ, అవి మన కెందుకూ వుపక రించని పరిస్థితి ఏర్పడుతుంది.

కొరవ 6 పేజీలో

# పివి కుటుంబం కాంగ్రెస్ పరువు తీసింది!

ఇంజనీరింగ్ కాలేజిల వివాదంలో తెలుగుదేశం పార్టీపై విమర్శల దాడి జరిపి, నిలదీసే అవకాశం కోల్పోయింది కాంగ్రెస్ పార్టీ. కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ పివి నరసింహా రావు కుటుంబ సభ్యులిద్దరు ముఖ్యమంత్రితో లాలూచీపడి చెరొక కాలేజిని సంపాదించు కోవడం ద్వారా కాంగ్రెస్ పరువు తీశారు.

రాష్ట్రంలో 8 ప్రైవేటు ఇంజనీరింగ్ కాలేజిలు, నాలుగు మెడికల్ కాలేజిలు, మూడు దంత వైద్య కళాశాలలు ఏర్పాటు చేయాలని చంద్ర బాబు నిర్ణయించారు. ఇంజనీరింగ్, వైద్య కళాశాల లంటే డబ్బు ప్రింట్ చేసే యంత్రాల వంటి సంస్థలని అందరికీ తెలిసిందే. కర్ణాటకలోని రాజకీయ వాదులందరికీ ఇంజనీరింగ్ కాలేజిలు కామధేనువుల వంటివి. పిండే కొద్దీ మరింత అధికంగా కరెన్సీ పాలు క్రుమ్మరిస్తాయవి. మెడికల్ కాలేజీ దొరికించు కోవడ మంటే – కుబేరుడ్ని ఇంటిలో వుంచుకోవడం క్రిందే లెక్క. మన రాష్ట్రంలోనూ క్యాపిటేషన్ ఫీజు నిషేధం వంటి సుప్రీం కోర్టు తీర్పులు ఎన్ని వున్నప్పటికీ కళాశాలల యాజమాన్యాలు సీట్లు అమ్మకాన్ని నిరంతరాయంగా, నిరాఘాటంగా కొనసాగిస్తూనే వున్నాయి. బిల్డింగ్ ఫండ్ పేరుతో, హాస్టల్ సీటుకు డొనేషన్ పేరుతో రసీదులిచ్చి, ఇప్పటికీ కూడా లక్షలకు లక్షలు గుంజు తున్నారు విద్యార్థుల నుంచి! ఎన్ఆర్ఐ కోటా సీట్లను బహిరంగంగా విక్రయించు కొనే అవకాశం ప్రభుత్వమే ఇచ్చింది. సబ్జెక్టును బట్టి 50 వేల నుంచి లక్ష వరకు పలుకు తున్నది ఒక్కొక్క సీటు ధర.

ఈ నేపథ్యంలో చంద్రబాబు నాయుడు ఒకేసారి ఎనిమిది ఇంజనీరింగ్ కాలేజిలు మంజూరు చేశారు. అఖిల భారత సాంకేతిక విద్యా మండలి సలహా పైనే ఈ కాలేజిలను ఎంపిక చేసినప్పటికీ అందులో రాజకీయ స్వలాభం లేక పోలేదు. గతంలో శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఇదే ప్రకారం కాలేజిలు మంజూరు చేస్తే – ఇదే చంద్రబాబు అప్పుడు అలివిమాలిన ఆగం చేశారు. ఆ వివాదం ముదిరి కాలేజీలు రద్దు కావడంతో పాటు, జనార్దన రెడ్డి ముఖ్యమంత్రి పదవినే పరిత్య జించ వలసి వచ్చింది.

అప్పుడు చంద్రబాబు ఇచ్చిన కాలేజీల విషయంలోనూ పెద్ద ఎత్తున ఆలజడి, ఆందోళన జరిపించాలని సిసిసి, సిఎల్‌పి నాయకులిద్దరూ తలపెట్టారు. హోటలు పడి పత్రికా ప్రకటనలూ చేశారు. కాని ప్రక్క రోజు వివరాలలోకి వెళ్లేసరికి కాంగ్రెస్ నాయకులే ఖంగు తినవలసి వచ్చింది. మంజూరైన కాలేజీలలో రెండింటిని పివి కుటుంబీకులే స్వంతం చేసుకోవడం దానికి కారణం. ఆయన కుమారుడు, ఎమ్మెల్యే శ్రీ పివి రాజేశ్వర రావు; మేనల్లుడు, రాజ్యసభ సభ్యుడు శ్రీ సింగాపురం రాజేశ్వర రావులు నల్గొండ, కరీంనగర్‌లలో కాలేజీల స్థాపనకు అనుమతి పొందారు. కాంగ్రెస్

కొరవ 10 పేజీలో

## కరెంట్ మాటే మరవాల్సి వస్తుందా?

రాష్ట్రంలో కరెంట్ సరఫరా పరిస్థితి మరీ దుర్భరంగా వుంది. రోజులు గడిచే కొద్దీ ఆంధ్ర దేశం అంధకార బంధురం కాక తప్పదన్న భయం కలుగుతున్నది. ఆగస్టు నెల సమీపిస్తున్నా, విద్యుత్ కోతను కొనసాగించక తప్పడం లేదు. పట్టణాలను రోజూ ఐదు గంటల చీకటి శాపం పీడిస్తున్నది. పల్లెలలో దుస్థితి చెప్పలే కున్నాము. పట్టుమని పదిగంటల సరఫరా సైతం లేదు.

దాదాపు పుష్కర కాలం నుంచి కరెంట్ కోత, చీకటి బ్రతుకు ఆంధ్రులకు అలవాటై నప్పటికీ, ఈ ఏడాది పరిస్థితి మరీ దుర్భరంగా వుంది. జలాశయ ఆధారిత విద్యుత్ కేంద్రాలు నెలల పర్యంతం పనిచేయ కుండా పాడుపడి పోవడమే దీనికి కారణం. సాధారణంగా జూన్ నెలాఖరుకు కృష్ణ నదిపై వున్న రిజర్వాయర్లన్నీ నీళ్లతో నిండిపోతాయి. కాని ఈ సంవత్సరం జూలై నెల సగం దాటబోతున్నా కనీస నీటి మట్టం రాలేదు. శ్రీశైలం రిజర్వాయర్ పూర్తి నీటిమట్టం 885 అడుగులైతే – కేవలం 798 అడుగుల ఎత్తున మాత్రమే నీరు వున్నది. నాగార్జున సాగర్‌లోనూ 590 అడుగుల స్థాయికి 499 అడుగులే నీరున్నాయి. రాష్ట్రానికి ఇవి రెండూ కీలకమైన జలవిద్యుత్ కేంద్రాలు. ఆ రెండూ ఏడాదిలో తొమ్మిది నెలలు పనిచేయ లేక పోవడంతో పరిస్థితి ఇంత హీనంగా తయారైంది.

కొరవ 6 పేజీలో

# దిక్కు, దివాణం లేని గూడూరు మునిసిపలాఫీసు

గూడూరు మునిసిపాలిటీలో పనిచేసే అధికారులుద్యోగులు హాజరు కాక పోవడంతో కార్యాలయం బోసిపోయి వుంది. ఇక్కడ పనిచేసే పలువురు వుద్యోగులు కుంటి సాకులు చెప్పి, లీవ్ చీటీలతో డాక్టర్ సర్టిఫికెట్లు తెచ్చుకోకుండానే సెలవుల్లో వెళ్లి పోతున్నారు. తిరిగి రాకుండానే ట్రాన్స్‌ఫర్‌లు చేయించుకుంటున్నారు. మునిసిపాలిటీలో లక్షల రూపాయలు వసూలు చేసి డ్రిగ్ మింగిన ముగ్గురు బిల్ కలెక్టర్లను ప్రభుత్వం సస్పెండ్ చేసింది. టౌన్‌లో అక్రమ కట్టడాలకు బిల్డింగ్ ఇన్స్‌పెక్టర్లు కారణమని ఇటీవల పెద్ద రచ్చ రేగింది. దీన్ని తట్టుకోలేక ఒక బిల్డింగ్ ఇన్స్‌పెక్టర్ సెలవులో వెళ్లగా, మరొకరు బదిలీ చేసుకొని పోయారు. 6వతేది ఒక ఆర్.ఐ మరో బిల్ కలెక్టర్‌ను ఎసిబి వారు లంచం తీసుకొంటుండగా పట్టుకున్నారు. మునిసిపల్ కమీషనర్ కూడా ఇటీవల బెదిరింపు ఫోన్లు రావడంతో కుటుంబ సభ్యుల ఒత్తిడి మేరకు ఆయనా బదిలీకి దరఖాస్తు పెట్టారట. ఎవరూ ఆఫీసుకు రాకపోయేసరికి ఒంటరిగా ఆ [illegible] ఏమిచేయాలో పాలుపోక మేనేజర్ కూడా సెలవు పెట్టాలని తలపోస్తున్నట్లు తెలిసింది. ఉద్యోగులెవరూ కార్యాలయానికి రాక పోవడంతో పనులపై కార్యాలయానికి వచ్చే ప్రజలు ఇబ్బంది పడుతున్నారు. మునిసిపల్ కార్యాలయం ఇంత గబ్బు పట్టి పోవడానికి రాజకీయ నాయకులు బాగా బాధ్యత వహించాలి. ఇది ఉద్యోగులు మాత్రమే చిక్కుల్లో పడిపోయారు.

### గూడూరు రోటరీకి కొత్త కార్యవర్గం

గూడూరు రోటరీ క్లబ్ నూతన కార్యవర్గ ప్రమాణ స్వీకారం ఇటీవల డి.ఎస్.ఆర్. కమ్యూనిటీహాల్‌లో జరిగింది.

## జిల్లావార్తలు

తిరుపతి పార్లమెంటు సభ్యుడు నెలవల సుబ్రహ్మణ్యం ముఖ్య అతిథిగా పాల్గొని మాట్లాడారు. రోటరీ క్లబ్ భవిష్యత్తులో చేపట్టబోయే కార్యక్రమాలకు సంపూర్ణ సహకారం అందిస్తానన్నారు. గతంలో రోటరీ క్లబ్ కార్యక్రమాల్లో పాల్గొని తానుపొందిన అనుభూతులు గుర్తుకు తెచ్చుకొన్నారు. క్లబ్ కొత్త అధ్యక్షునిగా బండి ఆదిశేషారెడ్డి, కార్యదర్శిగా డి.భాస్కరరెడ్డిలచే రోటరీ గవర్నర్ ఎన్.క్రిష్ణస్వామి ప్రమాణ స్వీకారం చేయించారు. రోటరీ మాజీ అధ్యక్షులు కె.ఆర్.రెడ్డి, తారా చంద్, దుగార్, ఎం.వెంకురెడ్డి, లయన్స్ గవర్నర్ వై.కె.ప్రభాకరరెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### 4కోట్ల 47లక్షలతో శ్రమదానం పనులు

మార్కెటింగ్ మంత్రి బి.రమేష్‌రెడ్డి 10వతేది [illegible] మండలం [illegible] పంచాయితీ ఎస్.టి. కాలనీలో రోడ్డు [illegible] పనిలో పాల్గొని శ్రమదానం చేశారు. 64 గిరిజన కుటుంబాలున్న ఈ కాలనీ [illegible] ఈ సందర్భంగా మంత్రి మాట్లాడుతూ జిల్లాలో 50శాతం శ్రమదానంతో 623 పనులు చేపట్టినట్లు చెప్పారు. వీటి ఖర్చు 4కోట్ల 47లక్షల రూపాయలని ప్రతి మూడు నెలల [illegible] శ్రమదాన వారోత్సవాలు [illegible] యన్నారు మంత్రి. సర్వేపల్లి [illegible] సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి మాట్లాడుతూ [illegible] మండలంలో 15 శ్రమదాన పనులకు

కొరవ 9 పేజీలో

ఆత్మకూరు దగ్గర నాగులపాడులో శ్రమదానం చేస్తున్న మంత్రి బి. రమేష్‌రెడ్డి; [illegible] లక్ష్మయ్య నాయుడు

# కావలి వ్యవసాయ యాత్రా దోపిడీ!

రాష్ట్ర ప్రభుత్వం తరపున హైదరాబాదు అధికారులు ఇజ్రాయిల్ దేశం వెళ్లగా లేనిది, తాము ఫెర్రీ [illegible] తీర్థ యాత్ర చేస్తే తప్పేమిటని కావలి వ్యవసాయ శాఖాధికారులు తలపోసినట్లుంది. ఇంటిల్లిపాది ప్రభుత్వ సొమ్ముతో యాత్రకు వెళ్లి ఈ కరువు కాలంలో ఖజానాకు చిల్లుపెట్టారు. కావలి వ్యవసాయ శాఖ క్షేత్రానికి అనుబంధంగా వింజమూరు, ఆత్మకూరు, పొదలకూరుల్లో వాటర్ షెడ్ [illegible] వున్నాయి. ఈ ప్రాంతాల్లోని రైతులు ఇతర రాష్ట్రాలకు వెళ్లి అక్కడ వాటర్ షెడ్ల పని తీరు పరిశీలించి అనుభవం గడించేందుకు ప్రభుత్వం లక్షా 18వేలు మంజూరు చేసింది. దీన్ని అవకాశంగా తీసుకొని నామమాత్రంగా [illegible] రైతులను మాత్రమే ఎంపిక చేసి కావలి వ్యవసాయ శాఖ, భూమి [illegible]

కొరవ 6 పేజీలో

# పరిహాసాల ప్రభుత్వం

ఐక్య ఫ్రంట్ నేతృత్వంలోని కేంద్ర ప్రభుత్వ పోకడలు పరిపాలనా వ్యవస్థను పరిహాసాల పాల్జేస్తున్నాయి. అధికారాన్ని అంటి పెట్టుకొని వుండడమనే ఏక సూత్ర కార్యక్రమ లక్ష్యంతో అడుగడుగునా రాజీపడుతూ, అర్థమైన దారుల గుండా పయనిస్తూ అభాసు పాలౌతున్నది ప్రభుత్వం. కనీసపాటి నైతిక ప్రమాణాలు, ప్రజాస్వామ్య విలువలు, వ్యక్తిగత ఆత్మగౌరవానికి కూడా తిలోదకాలిచ్చి పదవిని పరిరక్షించు కోవడమే పరమావధిగా వ్యవహరిస్తున్నారు ప్రధానమంత్రి.

అసలు దేవగౌడ వంటి నాయకుడ్ని నేతగా ఎన్నిక చేయడం ద్వారానే ఐక్య ఫ్రంట్ తన విలువను, గౌరవాన్ని క్షీణింప చేసుకున్నది. రాష్ట్ర సరిహద్దులు దాటి ఎరుగని; జాతీయ దృక్పథం లేని; జాతీయ భాష కూడా రాని ఒక సాధారణ రాజకీయవాదిని ఆ అత్యున్నత అధికార పీఠంపై అధిష్టింప చేయడమే వారు చేసిన తప్పు. ప్రధాన మంత్రి తమ చెప్పుచేతల్లో, కీలుబొమ్మ వలె పడి వుండాలనే దురుద్దేశ్యంతోనే లాలూ ప్రసాద్ యాదవ్, చంద్ర బాబు నాయుడు వంటివారు దేవగౌడను ఎంపిక చేశారేమో నన్పిస్తుంది. అందుకు తగినట్లే వుంది ఆయన ప్రవర్తన. తన స్వంత మంత్రి వర్గాన్ని తన చిత్తం వచ్చినట్లు ఏర్పర్చుకొనే స్వాతంత్ర్యం; తనకు నచ్చని వారిని దూరంగా పెట్టే స్వేచ్ఛ కూడా లేదాయనకు. ఎప్పుడు ఎవరు వచ్చి బెదిరిస్తే వారికి మంత్రి పదవి; ఎవరే శాఖ కావాలని గద్దిస్తే వారికా శాఖ ఇచ్చు కొంటూ పోతున్నా డాయన. వారానికొకసారి క్యాబినెట్ విస్తరణ సాధారణమై పోయింది. తతిమా మంత్రులకు కూడా తెలియ కుండా కొత్త మంత్రులు ప్రమాణ స్వీకారాలు చేస్తున్నారు. శాఖలూ అట్లనే మారి పోతున్నాయి.

ఇంకొక ప్రక్క హంతకులు, దారిదోపిడీ దారులు, క్రిమినల్స్ కేంద్ర మంత్రి వర్గ సభ్యులై పోతున్నారు. జాలప్ప, ఇబ్రహీం, తస్లీముద్దీన్ వంటి వారందరూ నేర చరిత్ర కల్గినవారే. హత్య, మానభంగం, డెకాయిటీ వంటి కేసులు పెండింగ్‌లో వున్న తస్లీముద్దీన్‌ను కేంద్ర హోం మంత్రి చేసిన ఘనత దేవగౌడదే; దానిపై జనంలో నిరసన వెల్లువ వెల్లువెత్తినా — అతడ్ని ఆ పదవి నుంచి తొలగించే సాహసం చేయ లేకపోయాడు. తన మంత్రి మండలి నిర్వహణలో తానెంత అశక్తుడో ఈ సంఘటన ద్వారా లోకానికి వెల్లడి చేశాడు ప్రధాన మంత్రి. తస్లీముద్దీన్‌పై చర్య తీసుకొంటే బీహార్ ముఖ్య మంత్రి లల్లూ ప్రసాద్ యాదవ్‌కు కోపం వస్తుందని భయపడ్డా డాయన.

తన స్వంత రాష్ట్రంలో తన స్వంత పార్టీ నాయకుడు జాలప్ప విషయంలోనూ ఇదే భయం ప్రదర్శించడం విచిత్రం. కత్తి చూపించి, రోడ్డ నిలేసి, జేబులోని సొమ్ము ఐపురుక పోయే వీధి రౌడీల మాదిరి జనతాదళ్ నాయకులు దేవగౌడ నుంచి మంత్రి పదవులు పెరుక్కొం టున్నారు.

కాంగ్రెస్ నాయకుడు పివి నరసింహా రావు గారిని మాసీ ఇదే తీరులో హడలి చస్తున్నాడు ప్రధాన మంత్రి. వివిధ కేసుల నుంచి పివిని రక్షించడం కోసం ఆయన కేంద్ర నేర పరిశోధక సంస్థ సిబిఐని సాధనంగా వాడుతున్నారు; పివిపై ఈగ వాలకుండా కాపాడు తున్నారు.

ఇంకొక ప్రక్క పరిపాలనా వ్యవహారాలపై సైతం ఆయనకు అదుపు లేదు. అధికారులను బదలీ చేయాలన్నా, తన స్వంత కార్యాలయ కార్యదర్శులను నియమించు కోవాలన్నా ఐక్య ఫ్రంట్‌లోని ఇతర నేతల అనుమతి కోసం ఎదురు చూడవలసి వస్తున్నది. మంత్రులు తమ ఇష్టానుసారం నిర్ణయాలు తీసుకొని, వ్యవహారా లు నడిపేస్తుం టే చూస్తూ వూరుకోవడం తప్ప వారిని నియంత్రించే సాహసం ఆయనకు లేదు.

జమీన్‌రైతు

తన చర్యలు, నిర్ణయాలు, పోకడల ద్వారా తాను అవమానాల పాలు కావడమే కాక, తన ప్రభుత్వాన్నీ పరిహాసాల పాలు చేస్తున్నాడు దేవగౌడ — ఇంతటి అశక్తులు, స్వంత ఆలోచన చేయలేని దుర్బలులు ప్రధాన మంత్రులైతే దేశ భవిష్యత్ ఏమిటి?

పార్టీపైన, ప్రభుత్వంపైన తిరుగులేని అధికారం; జనంలో ఎదురులేని సమ్మోహనా శక్తి కల్గిన నెహ్రూ, ఇందిరా గాంధీ, రాజీవ్ గాంధీ వంటి నేతల పరిపాలనలోనే దేశంలో అవినీతి, అరాచకం, అశాంతి పెచ్చరిల్లాయి. తమ స్వంతానికి చిల్లిగవ్వ మిగుల్చుకోని ఆ త్యాగమూర్తుల హయంలోనే అధికారులు, మంత్రులు ప్రజాధనం దోపిడీకి పాల్పడినారు. అప్పుడు దేవగౌడకు పార్టీపైన, ప్రభుత్వం పైనే కాదు తన స్వంత మంత్రుల పైనే పట్టులేదు. మంత్రు లందరూ తమ తమ పార్టీ నాయకుల ఆదేశాలకు, నిర్ణయాలకు, విధానాలకు బద్ధులౌతున్నారే తప్ప ప్రధాన మంత్రిని తమ ఉత్తరా ధికారిగా గుర్తించి, గౌరవించడం లేదు. వ్యక్తిగతంగా దేవగౌడ పిడబ్ల్యూడి కాంట్రాక్టర్ల నుంచి పాతిక వేలు, యాభై వేలు సైతం ఎన్నికల నిధి దండుకొన్న సాదా సీదా నాయకుడు. ఈ పరిస్థితులలో ఆయన నేతృత్వంలోని ప్రభుత్వం పట్ల ప్రజలు విశ్వాసం వుంచుకో గలరా? భారత దేశం ఒక జాతిగా — మనగల్గు తుందా? భవిష్యత్‌ను తలుచు కొంటేనే భయమేస్తున్నది!



12-07-46

వెల: 0-1-6 పేజీలు: 6

వెల్లూరు ముచ్చట్లు

గోరక్షణ

జిల్లాలో గోరక్షణ కొరకు అందరూ పశువులను కసాయి వాళ్ల పాలబడకుండా చూడాలని, సంఘంలో చేరాలని, గట్టిని పోగుచేయాలని, సభలు జరిపి గోరక్షణ ప్రచారం చేయాలని కార్యదర్శి గుర్రం వెంకట సుబ్బారామయ్య గారు కోరుతున్నారు.

వరగలి బడి

బడి పిల్లలు ఆరగిపోతారేమో! ఆపేరు కూడా మారెందుకు జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారు?

ఈదూరు రోడ్డు

తోటపల్లి గూడూరు - ఈదూరు రోడ్డును 1938లో ప్రారంభించారు 2038 సం. కాని పూర్తి కాదా?

గూడూరు, సూళ్ళూరుపేట బాలికాలలో బోర్డు స్కూలు ఉపాధ్యాయులకు మే, జూన్, రెండు మాసాల జీతాలింకా మట్టలేదట. వాళ్ల గతి ఏమిటావాలి ఈ కరువు రోజుల్లో?

కొన్ని రోజులు జమీన్‌రైతు సహాయ సంపాదక వర్గంలో వుండిన భూకుహర శాస్త్రజ్ఞులైన పిడూరు కామేశ్వరరావు గారిని మైకా ఇన్‌స్పెక్టర్‌గా నియమించినందుకు సంతోషం. నీతి వంతంగా కీర్తి ప్రతిష్ఠలు సంపాదించమని మా సలహా.

* * *

వరగలి వేమారెడ్డి శ్రీనివాసులు రెడ్డి గారు జైలుకు పోయి వెయ్యి రూపాయలు జుల్మానా చెల్లించి కాంగ్రెసు లిష్టులో పురాతనంగా వున్నవారు. అతని విభక్త - కుటుంబీకుని అన్న కొడుకు తమ్ముడు మొగుడు కల్లు చెట్లు ఇవ్వాడన్న మిషతో ఆయన నామినేషన్ కొట్టివేశాడు.

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

పొదలకూరు డాక్టరు గారు వచ్చిన రోగులకు రంగు నీళ్లు పోసిచ్చి కాలం గడపకుండా గ్రామ పార్టీలలో తలదూర్చడం ఏమంత మంచి పనికాదు.

పల్లెటూళ్లు

కావలి

క్రొత్త ఇంట్లో చేరాలంటే ఆరోగ్య దేవత అహూతి అడుగుతున్నది. అన్ని గ్రహాల్లో ఈ గ్రహం కూడా కలుసుకున్న దన్నమాట - కలుగోలమ్మ.

కొరవ 8 పేజీలో

# మద్య నిషేధం రద్దుకు కుంటి సాకులు వెతకవద్దు!

కిలో రెండు రూపాయలకు బియ్యం, సంపూర్ణ మద్య నిషేధం నినాదాలతో అధికారంలోకి వచ్చిన తెలుగుదేశం పార్టీ ఎన్నికలు పూర్తికాగానే మాట మార్చింది. సబ్సిడీ బియ్యం, మద్య నిషేధం వల్ల రాష్ట్ర ఆర్థిక పరిస్థితి అస్తవ్యస్తమయ్యిందని, మద్య నిషేధం అచరణలో విఫలమయ్యిందని, మేధావుల సలహాతో మద్య నిషేధం ఎత్తి వేసే విషయం పరిశీలిస్తున్నామని చెప్తున్నారు. తమ జీవితాలను మెరుగు పరుచుకొనే ప్రజలు ఉద్యమించి మద్య నిషేధాన్ని సాధించుకొన్నారు. ప్రజా పోరాట ఫలితమైన మద్య నిషేధ చట్టాన్ని కుంటి సాకులతో రద్దు చెయ్యడమంటే ప్రజల హక్కులపై దాడి చెయ్యడమే అవుతుంది. రాష్ట్రం నేడు ఎదుర్కొంటున్న ఆర్థిక సమస్యలకు కారణం ప్రభుత్వం అనుసరిస్తూ వస్తున్న అస్తవ్యస్థ విధానాలే కారణం. వాటిని సరిచేసి ఆదాయాన్ని పెంచుకోకుండా ఈవిధమైన కుటిల యత్నాలు చేయడం తగదు.

గూడూరు ఎ.సుబ్రమణ్యం

(పౌరహక్కుల సంఘం)

## పార్టీ తీరు మారాలి!

పి.వి.నరసింహారావు ప్రధానిగా వున్నప్పుడు ఎందరో కార్యకర్తలు అభిమానించారు. కాని ఈ మధ్య ఆయన ప్రమేయం వున్నట్లు బయట పడుతున్న అవినీతి కుంభ కోణాలు వింటుంటే ఇటువంటి నాయకుని నీడలో పనిచేసి నందుకు బాధగావుంది. పార్టీ గురించి ఆలోచించే నాయకులే కాంగ్రెస్ పార్టీలో కరువై పోతున్నారు. స్వలాభా పేక్షతో దేశాన్ని ఎట్లా దోచుకు తిందామా అన్న ధోరణి తప్ప దేశ ప్రజల సంక్షేమం గూర్చి ఆలోచించే వారు లేరు. ఇటు వంటి పరిస్థితుల్లో కాంగ్రెస్ పార్టీలో పునర్వ్యవస్థ జరిగి తీరాలి. నాయకులు తమ పద్ధతులు మార్చు కోవాలి. లేకుంటే

## జనవాణి

పార్టీ కోసం పనిచేసే కార్యకర్తలు లేని రోజు వస్తుంది.

ఇస్కపల్లి సి.సుబ్రహ్మణ్యం

## పొట్టెపాళెంలో దోమల బెడద

పొట్టె పాళెం గ్రామంలో రోజ్‌గార్ నిధులతో కట్టిన మురికి కాలువ మూలంగా గ్రామంలో దోమల బెడద ఎక్కువయ్యింది. ఈ కాలువను అసమగ్రంగా కట్టి వదిలేశారు. దీన్ని ఊసుకెళ్లి కలిపిన ఊట కాల్వను గ్రామస్తులు ఎప్పుడో పూడ్చిపారేశారు. దీనివల్ల గ్రామంలోని మురికి నీరు ఎక్కడి దక్కడే నిలిచిపోయి, దోమల ఉత్పత్తి కేంద్రంగా మారి పోయింది. గ్రామ పంచాయితీ ఈ కాలువ విషయాన్ని పట్టించు కోవడం మానేసింది. గ్రామీణాభివృద్ధికి పాటు పడే ఏ ప్రభుత్వ శాఖైనా కాలువ పొడిగింపుకు నిధులు మంజూరు చేస్తే గ్రామం వెలుపల వరకు కాల్వ నిర్మించి, గ్రామాన్ని పరిశుభ్రంగా వుంచవచ్చు.

పొట్టెపాళెం షేక్.రహంతుల్లా

## వీధి కుక్కల బెడద

జిల్లాలోని పలు గ్రామాల్లో వీధి కుక్కలు ఎక్కువై పోయాయి. ఇంతకు మునుపు వలె వీటిని పట్టించే కార్యక్రమాన్ని గ్రామ పంచాయితీలు చేపట్టడం లేదు. దీని వల్ల పిల్లలు, వృద్ధులు, చివరికి పశువులు కూడా కుక్క కాట్లకుగురై అకాల మరణాలు పొందుతున్నారు. జిల్లా ప్రభుత్వ ఆసుపత్రిలోగాని, ప్రాథమిక ఆరోగ్య ఉప కేంద్రాల్లోగాని కుక్క కాటుకు వేసే వాక్సిన్ వుండడం లేదు. బయట అమ్మేవి కల్తీవని తేలింది. ప్రజల ప్రాణాలు కాపాడ వలసిన బాధ్యత ప్రభుత్వానిది.

కొరవ 8 పేజీలో

ఎస్పి కితాబు

# నెల్లూరునాయకులు బుద్ధిమంతులు - పోలీస్‌కేసుల్లో జోక్యం చేసుకోరు!

పోలీస్ స్టేషన్ వ్యవహారాలలో రాజకీయ నాయకుల జోక్యం నెల్లూరు జిల్లాలో చాలా తక్కువని; ఇతర జిల్లాలతో పోలిస్తే ఇక్కడివారు చాలా బుద్ధిమంతులని ఎస్పి శ్రీ పూర్ణచంద్ర రావు కితాబిచ్చారు. కీలకమైన ఏ కేసులోనూ తాము రాజకీయ నాయుల ఒత్తిడి పెట్టించు కోవడం లేదని చెప్పారాయన.

జిల్లాలో పోలీస్ శాఖ పనితీరు వివరించ దానికి మొన్న 7 తేది ప్రెస్ క్లబ్‌లో విలేఖరులతో ముచ్చటించారు పూర్ణ చంద్ర రావు గారు. పోలీసు యంత్రాంగాన్ని ప్రజలకు సన్నిహితం చేయడానికి స్టేషన్ల నిర్వహణలో కొన్ని మార్పులు చేస్తున్నారట. ప్రతి పోలీస్ స్టేషన్‌లో ఒక కానిస్టేబుల్‌ను రిసెప్షన్ ఆఫీసర్‌గా నియమిస్తారు. స్టేషన్‌కు వచ్చే ఫిర్యాది దారులను, ప్రజలను స్వాగతించి, వారి సమస్యలు విని, అర్జీలు తానే వ్రాసి, ఉన్నతాధికారులకు పంపడం అతడి విధి. తర్వాత దానిపై తీసుకొన్న చర్యనూ సంబంధితులకు తెలియ జేయడం అతడి బాధ్యత.

ఇటువంటి పథకాలు ఆలోచనల్లో చాలా బాగుంటాయి; ఆచరణలో మాత్రం తేలిపోతుంటాయి. స్టేషన్‌కు తనకు మధ్య ఒక సమాచార వారధి నిర్మించడం ఎస్పిగారి ఉద్దేశ్యంగా వున్నట్లుంది.

నేషనల్ హైవేలపైన మొబైల్ స్క్వాడ్‌లను రాత్రిపగలు త్రిప్పడం వల్ల జిల్లాలో దోపిడీలు, బందిపోటు దొంగతనాలు తగ్గాయని; పబ్లిక్ ప్రదేశాలలో అమ్మాయిలను వేధించే రోడ్ సైడ్ రోమియోలపై కఠిన చర్యలు తీసుకో బోతున్నామని; అశ్లీల చిత్రాల ప్రదర్శన, బూతు పుస్తకాల అమ్మకాలను చాలా వరకు నిరోధించామని; పేకాట క్లబ్‌లను నిర్దాక్షిణ్యంగా మూసి వేస్తున్నామని చెప్పారు పూర్ణ చంద్ర రావు గారు.

బుచ్చి భాగ్యమ్మ కేసులో ఎవరి ఒత్తిడికి తలవంచేది లేదు; మానవత్వం లేకుండా ప్రవర్తించిన ఆ పీములను పట్టి, శిక్షించడం జరిగి తీరుతుందన్నా రాయన. చట్ట వ్యతిరేక కార్యకలాపాల విషయంలో ప్రజలు తనకు నేరుగా సమాచార మందిస్తే పోలీసు పనితనం చేసి చూపిస్తానని; పత్రికల్లో వచ్చే వార్తలు, వ్యాఖ్యలపై తాను ఎప్పటి కప్పుడు సానుకూలంగా స్పందించి చర్యలు తీసుకొంటున్నానని చెప్పారు ఎస్పిగారు.

జిల్లా అధికారులతో ముఖాముఖి కార్యక్రమాలు ఏర్పాటు చేయ తలపెట్టింది నెల్లూరు ప్రెస్ క్లబ్. అందుకు నాంది ఈ ఎస్పిగారితో ముచ్చట.

**ప్రతి పోలీస్ స్టేషన్‌లోనూ ప్రజలను స్వాగతించను ఒక రిసెప్షన్ ఆఫీసర్‌ను నియమిస్తారట!**

## కాంగ్రెస్ నిరసన

పెట్రోల్, గ్యాస్ ధరలు పెంచినందుకు నిరసనగా 8తేది జిల్లా కాంగ్రెస్ కమిటీ ఆధ్వర్యంలో రాస్తారోకో జరిగింది. ఆత్మకూరు బస్టాండు వద్ద గంటకు పైగా ట్రాఫిక్ నిలిపేశారు. జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు ఆనం సంజీవరెడ్డి మాట్లాడుతూ పెట్రోలియం, గ్యాస్ ధరలు పెంచడం వల్ల మధ్య తరగతి ప్రజలు కోలుకోలేరన్నారు. పెట్రోల్, గ్యాస్ ధరలు పెంచిన జనతాదళ్ ప్రభుత్వం పరిపాలించే అర్హత కోల్పోయినట్లు మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానందరెడ్డి చెప్పారు. కాంగ్రెస్ పార్టీ కేంద్రంలో గౌడ ప్రభుత్వానికి మద్దతిస్తున్నది. ప్రజా సంక్షేమ కార్యక్రమాలు అమలు జరిపించేందుకే గాని వ్యతిరేక చర్యలు చేపట్టేందుకు కాదన్నారు. రాస్తారోకో కార్యక్రమంలో జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు కువ్వారపు రమణమ్మ, టౌన్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ, బి.ఎ.లక్ష్మి, పిసిసి సభ్యుగు కె.శ్రీధరరెడ్డి, షేక్ మొహియుద్దీన, కౌన్సిలర్ పి.విజయకుమార్ నాయుడు, బి.మధుసూధన్ తదితరులు పాల్గొన్నారు.

## బిజెపి నిరసన

పెట్రోల్, గ్యాస్ ధరలు పెంచినందుకు బిజెపి కలెక్టర్ కార్యాలయం వద్ద ధర్నా నిర్వహించింది. కార్యక్రమంలో జిల్లా బిజెపి అధ్యక్షుడు సురేష్‌రెడ్డి, కార్యదర్శి గద్దం లక్ష్మినారాయణ, పట్టణ అధ్యక్షుడు సి.హెచ్.రామకృష్ణారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# ట్యూషన్లు చెప్పే అయ్యవార్ల భరతం!

ప్రభుత్వ కళాశాలల్లో పనిచేస్తూ బయట ట్యూషన్లు చెబుతున్న టీచర్లను నియంత్రించాలని అఖిల భారత విద్యార్థి పరిషత్ 5తేది కలక్టరేట్ వద్ద ధర్నా నిర్వహించింది. ఈ సందర్భంగా ఇక్కడ గుమిగూడిన విద్యార్థుల నుద్దేశించి ఎబివిపి నాయకుడు చంద్రశేఖర్ మాట్లాడారు. బయటి జిల్లాల నుండి ప్రభుత్వ ఎయిడెడ్ కళాశాలల్లోని అధ్యాపకులు పలువురు మెడికల్ లీవులు, లాంగ్ లీవులు పెట్టివచ్చి ఇక్కడ కోచింగ్ సెంటర్లలో పనిచేస్తున్నారని, ఉద్యమంలో పాల్గొంటున్న విద్యార్థులను సర్వోదయా లెక్చరర్లు బెదిరిస్తున్నారని ఆరోపించారు. వీరిపై చర్య తీసుకోవాలని కలెక్టర్‌కు మెమోరాండం సమర్పించారు. ధర్నాకు ముందు ఎస్.వి.జి.యస్ కళాశాల నుండి విద్యార్థులు ప్రదర్శనగా కలక్టరేట్ చేరుకున్నారు.

## నెల్లూరు మునిసిపల్ స్కూళ్లలో సౌకర్యాలు లేవు

నెల్లూరు టౌన్‌లో వున్న 22 మునిసిపల్ పాఠశాలల్లోని విద్యార్థులకు కనీస వసతులు లేక పోవడంతో పాటు ఉపాధ్యాయుల పోస్టులు భర్తీ చేయక పోవడం వల్ల చాలా సమస్యలు ఎదుర్కొంటునట్లు ఎస్.ఎఫ్.ఐ జిల్లా కార్యదర్శి కృష్ణయ్య చెప్పారు. ప్రెస్ క్లబ్‌లో విలేకరులతో మాటాడుతూ టౌన్‌లోని పాఠశాలల్లో 14,600 మంది విద్యార్థులు చదువుతుండగా వీరిలో 8వేల మంది బాలికలున్నారని; మునిసిపల్ పాఠశాలల్లో 153 టీచర్ పోస్టులు ఖాళీగా వున్నాయని చెప్పారు. పోస్టుల భర్తీతో పాటు సమస్యల పరిష్కారానికి మునిసిపాలిటి చొరవ చూపించకుంటే మునిసిపల్ సమావేశం జరిగే రోజు మునిసి పలాఫీసును ముట్టడిస్తా మని బెదిరించా రాయన.

## ఆల్‌మట్టి డ్యాం నిర్మాణం ఆపాలి

కేంద్ర జల వనరుల సంఘం నిబంధనలకు వ్యతిరేకంగా నిర్మిస్తున్న ఆల్‌మట్టి నిర్మాణం జరిగితే తెలుగు మాగాణులు కరువుకు గురౌతాయని

**ఉద్యమం మళ్లీ ప్రారంభం**

పిసిసి సభ్యుడు కె.శ్రీధరరెడ్డి చెప్పారు. 9తేది ప్రెస్ క్లబ్‌లో మాట్లాడుతూ జల నిపుణుల లెక్కల ప్రకారం అల్‌మట్టి డ్యాం నిర్మాణం పూర్తి అయితే రాష్ట్రంలో 38లక్షల ఎకరాలకు నీరు లభించదు. సోమశిల, తెలుగు గంగ, శ్రీశైలం ప్రాజెక్టులు దెబ్బతినడమే కాకుండా కండలేరు రిజర్వాయర్, కృష్ణ, పెన్నార్ డెల్టాలు ప్రమాద స్థితికి చేరుకొంటాయని అన్నారాయన. డ్యాం నిర్మాణం ఆపడంలో తెలుగుదేశం పార్టీతో కాంగ్రెస్ కూడా కలసి దేవగౌడపై వత్తిడి తేవాలని శ్రీధరరెడ్డి కోరారు.

# జిల్లాలో స్కూళ్లకు 40 కోట్లు - అందరికీచదువుచెప్పడంలక్ష్యం!

రాష్ట్రంలో ప్రాథమిక విద్యకు, సెకండరీ విద్యకు ప్రభుత్వం అధిక ప్రాధాన్యత నిచ్చి విద్యా కార్యక్రమాలు అమలు చేస్తున్నట్లు రాష్ట్ర విద్యా శాఖ మంత్రి బల్లి దుర్గా ప్రసాద్ చెప్పారు. నెల్లూరు ఆర్ అండ్ బి అతిథి గృహంలో జరిగిన విద్యాశాఖాధికార్ల సమావేశంలో మాట్లాడారాయన. 2వేల సంవత్సరం నాటికి అందరికీ ప్రాథమిక విద్య అందించడానికి బ్రిటీష్ ఓవర్ సీస్ డెవలప్‌మెంట్ సంస్థ సహాయసహకారాలు తీసుకొంటున్నట్లు చెప్పారు మంత్రి. నెల్లూరు, కర్నూలు, వరంగల్, విజయనగరం, కరీంనగర్ జిల్లాల్లో ఈ కార్యక్రమాన్ని అమలు చేసేందుకు ఒక్కొక్క జిల్లాకు 40కోట్ల వంతున విడుదల చేస్తున్నట్లు తెలియ జేశారు. అందరికీ పాఠశాల అందుబాటులో వుండేటట్లు చూడడం. బడికి వెళ్లే వయస్సుగల పిల్లలందర్నీ నూటికి నూరు శాతం పాఠశాలల్లో చేర్పించడం, గుణాత్మక మైన విద్యా బోధన ద్వారా విద్యార్థు లందరూ కనీస అభ్యసన స్థాయి కలిగి వుండేటట్లు చేయడం ఈ కార్యక్రమ లక్ష్యాలు. జిల్లాలో ఈ కార్యక్రమానికి తొలివిడతగా 2కోట్ల 56 లక్షలు మంజూరు చేసినట్లు మంత్రి చెప్పారు.

## పురావస్తువుల వివరాలు తెలపండి

జిల్లాలోని పట్టణాలు, గ్రామాల్లో వున్న ప్రాచీన కాలం నాటి

**నెల్లూరు సంగతులు**

దేవాలయాలు, శిల్పాలు, కట్టడాలు, శాసనాలు, చారిత్రక ప్రదేశాలను వెలికి తీసి జిల్లా కేంద్రంలోని పురావస్తు మ్యూజియంలో భద్రపరచనున్నట్లు ఇన్‌టాక్ ముఖ్య కార్యదర్శి శ్రీ గోపాలకృష్ణయ్య చెప్పారు. సైక్లోన్ మీటింగ్ హాల్‌లో 8తేది ఇన్‌టాక్ సభ్యులతో ఏర్పాటు చేసిన సమావేశంలో ఆయన మాట్లాడారు. జిల్లాలో కొన్ని వందల సంవత్సరాల కాలం నాటి శిథిలావస్థలో వున్న దేవాలయాలు, శిల్పాలు, కట్టడాల వివరాలు సేకరించి వాటి అభివృద్ధికి కార్యాచరణ పథకం రూపొందిస్తారట. జిల్లా కలెక్టర్ డాక్టర్ డి.సాంబశివరావు మాట్లాడుతూ జిల్లాలోని చరిత్ర కలిగిన శిల్పాలు, దేవాలయాలు, విగ్రహాలు, శాసనాలు, ఆరాధనా స్థలాల వివరాలను కార్డుపై వ్రాసి కలెక్టరేట్‌లోని ఇన్‌టాక్ విభా[illegible] పంపమని ప్రజలను కోరారు.

## నీటి ఎద్దడి లేకుండా చేయండి!

నెల్లూరు శాసనసభ నియోజక వర్గ పరిధిలో మంచినీటి ఎద్దడి లేకుండా చేయాలని, దానికి అధికారులు తక్షణ చర్యలు తీసుకోవాలని మార్కెటింగ్ మంత్రి టి.రమేష్‌రెడ్డి ఆదేశించారు. పట్టణ శివార్లలో కొత్తగా ఏర్పడుతున్న కాలనీలకు రోడ్డు వసతి, మంచినీటి వనరుల కల్పనలపై శ్రద్ధ వహించాలన్నారు. మంత్రి వివిధ శాఖాధి కారులతో తన నివాసంలో 5తేది సమావేశ మయ్యారు. శివాజీనగర్, గ్రామీణ

కొరవ 10 పేజీలో

# నెల్లూరు రాజకీయాలు
## విశ్లేషకుడు

### బుచ్చి కేసు

వర విక్రయాల కీచక ప్రవృత్తికి గురై, జీవితం చాలించిన బుచ్చిరెడ్డి పాళెం అభాగ్య యువతి భాగ్యమ్మ కేసు విషయంలో ఎస్‌పి శ్రీ పూర్ణచంద్ర రావు చాలా శ్రద్ధ తీసుకొని దర్యాప్తు జరిపిస్తున్నారు. రాజకీయ వాదుల అండ దండలతో పోలీసుల కళ్ళుగప్పి తిరుగుతుండిన కీలకమైన ముద్దాయి లిద్దరిని పట్టుకున్నారు. ఇస్మాయిల్, హుసేన్ అనే ఈ ఇద్దరూ ఒంగోలులో తలదాచుకొని వుండినారట. సుబ్బారెడ్డి అనే నిందుతుడ్ని మొదటే పట్టుకొన్నారు. ప్రసాద్, సుధాకర రెడ్డి అనే ఇద్దరు నిందితులు పట్టుబడ వలసి వుంది. వీరి కోసం పోలీసులు అన్వేషిస్తున్నారు. తమ కళ్ళలో కారం కొట్టి, కోర్టులో లొంగి పోతారనే భయంతో కోవూరులో మఫ్టీ కానిస్టేబిళ్ళ పహారా కాస్తున్నారు.

ఇంత వరకు పోలీసుల ప్రవర్తన ప్రశంస నీయమే. కాని కీలకమైన కోణం నుంచి దర్యాప్తు జరపకుండా, కేవలం సంఘటనకు ప్రత్యక్ష బాధ్యులైన వారి గురించే వెతుకులాడడం వల్ల దర్యాప్తు ప్రక్కదారి పట్టి పోతున్నదేమో ఎస్‌పి గారు ఆలోచించాలి. భాగ్యమ్మను వివస్త్రలను చేసింది ఈ ఐదుగురు నిందితులే కావచ్చు; కాని వారా పనికి పాల్పడడానికి కారణమేమిటి. పట్టపగలు అంత దుర్మార్గం చేయడానికి వారికా ధైర్యం ఇచ్చిందెవరు, ఏ లక్ష్యంతో వారు తమ కీచక ప్రవృత్తిని బయట పెట్టుకున్నారు అన్నది అసలు ప్రశ్న. కేవలం కల్లుత్రాగిన మైకంలో వారు అంత దారుణంగా ప్రవర్తించా రనడం సహేతుకం కాదు. ఒక నిర్దిష్టమైన ఉద్దేశ్యంతోనే వారా దుశ్శాసన పర్వం నడిపి వుండాలి.

పేకాట క్లబ్ నిర్వహణ దీని వెనుక వుండే అంతర్యమని బుచ్చి జనాభిప్రాయం. తాము స్వేచ్ఛగా క్లబ్ నిర్వహించు కోవడానికి స్థానిక మహిళలు అటుంకాలు కల్పిస్తున్నారని, వారిని భయపెడితే తప్ప తమ వ్యాపారం జరగదని భావించే వీరిని ఈ దుర్మార్గానికి ప్రేరేపించారని స్థానికులు ఆరోపిస్తున్నారు.

అది నిజమైతే – వీరికంటే ముందు ఆ క్లబ్ నిర్వాహకులు ప్రధాన నిందితులౌతారు. పోలీసు దర్యాప్తు ఆ కోణం నుంచి జరిగినప్పుడే భాగ్యమ్మ వంటి మహిళలకు జరిగిన ఘోర దుర న్యాయానికి శిక్ష విధించి నట్లవుతుంది. ఈ రౌడీలు ఐదుగురూ బుచ్చిలో ఇటువంటి దుర్మార్గాలు చాలానే చేస్తుండే వారట. ప్రధాన నిందితుడైన ఇస్మాయిల్‌కు, పోలీసుకు చాలా దగ్గర చుట్టరికం వున్నట్లుంది. స్థానిక ఎస్‌ఐకి అతడు సన్నిహితుడట. అందువల్లే వారు సంఘటన జరిగిన తొలి రోజు బుచ్చిలోని ఒక లాడ్జిలోనే వున్నప్పటికీ, ఆ లాడ్జిపై దాడిచేసి, దోమల్ని వెతికినట్లు నటించి, వారు పారిపోయేందుకు పోలీసులే సహకరించారని చెప్తున్నారు. బుచ్చిలో ఇప్పటికీ వ్యభిచార గృహాలు, పేకాట క్లబ్‌లు నిరాఘటంగా కొనసాగుతూనే వున్నాయని, ఎస్‌పి హెచ్చరికలను స్థానిక పోలీసులు తాటాకు చప్పుళ్లుగా తీసుకొన్నారని చెప్తున్నారు.

సభ్య సమాజం సిగ్గుతో తలదించుకో వలసిన ఈ ఘోర దురంతంపై మరింత విశాల దృక్పథంతో దర్యాప్తు జరపడం అవసరం. కేవలం రౌడీలను పట్టి, నాలుగు రోజులు జైలులో పెట్టినంత మాత్రాన ఇటువంటి దుర్ఘటనలకు భరత వాక్యం పడదు; ఆ రౌడీలను పోషించి, తమ రాజకీయ, వ్యాపారవసరాలకు వాడుకొనే దుష్టులను వీరితో కలిపి శిక్షించ గల్గితేనే దర్యాప్తుకు ఫలితం. ఎస్‌పి గారు ఆలోచించాలి.

### జంట మంత్రులు

మార్కెటింగ్ మంత్రి శ్రీ టి.రమేష్‌రెడ్డి, బడుల మంత్రి శ్రీ బల్లి దుర్గా ప్రసాద్ లిద్దరూ జిల్లాలోనే వున్నారు. శ్రమదానం పనులతో మహా ఆయాస పడిపోతున్నారిద్దరూ. ఏపి మంత్రి, ఏపి ఎమ్మెల్యే ఎక్కడక్కడ ఎంతెంత చెమట కార్చింది పత్రికల్లో చూసి, కంప్యూటర్‌కు ఫీడ్‌చేసి పర్యవేక్షిస్తుండడంతో మంత్రు లిద్దరూ ఫోటోల కోసం తెగ ఫోజులిస్తున్నారు. ముఖ్యమంత్రి వలె తామూ పని చేసి చేసి సొమ్మసిల్లి పడిపోయినట్లు ఒక నాటకం సీను సృష్టించడానికి ప్రయత్నించారట కాని, అది ఫలించినట్లు లేదు. పాయంత్రం ఇళ్ళకు చేరి మాత్రం ఆపసోపాలు పడిపోతున్నారు.

### ఎపిపిగా సైదా తొలగింపు రభస

నెల్లూరు అడిషనల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా శ్రీ ఎస్‌ఎం సైదాను తొలగించి, క్రింది కోర్టు ఎపిపి శ్రీ రవీంద్ర రెడ్డికి ఛార్జి ఇవ్వడం న్యాయవాద వర్గాలలో రభస సృష్టించింది. శ్రీ ఓ. అబ్బాయ్ రెడ్డి తదితరులు దీనిపై పత్రికా ప్రకటనలు చేస్తూ – తెలుగు ఎమ్మెల్యేలు కుల రాజకీయంతో కుట

**Before the Motor Accidents Claims Tribunal, Nellore.**

O.P.No:62/95.

Thota Naga Prasad Rao alias T.N.P.Rao ... Claimant (Vs) 1. M.V.Ramaraju and another ... Respondents.

To: 1. M.V.Ramaraju, S/o Satyanarayana Raju, Eduru Village, Chillakuru Mandal, Nellore District.

Whereas the abpve named claimant has filed the above O.P.and the same stands posted to 18-7-1996 for your notice. You are required to be present before the above Court on the said date at 10-30 AM and make your objections. Otherwise the matter will be decided exparte.

**S. Ajaykumar**
Advocate for Petitioner

# సోమశిల నీళ్ళు చోరీ?

రాజకీయ వాదులు సాగునీళ్లపై పెత్తనం చేస్తే భవిష్యత్‌లో చాలా పెద్ద సమస్యలు వచ్చేట్లున్నాయి. ఇప్పటికే అలమట్టి డ్యాం వల్ల సోమశిలకు కృష్ణనీరు వచ్చే అవకాశం వుండకపోవచ్చునని రైతాంగం హడలి చస్తుంటే – సోమశిల నుంచి దొంగతనంగా నీళ్లను కండ్లేరుకు, అటునుంచి మద్రాసుకు తరలించే ప్రయత్నమేదో సాగుతుందని సందేహించ వలసి వస్తుంది.

మొన్నటి అకాల తుఫాన్ ఫలితంగా సోమశిలకు 33 టిఎంసిల నీరు వచ్చింది వీటిని సక్రమంగా వినియోగిస్తే నెల్లూరు, కోవూరు డెల్టాలతో పాటు; కనుపూరు, కావలి కాలువల క్రింద ఆయకట్టంతటికీ మొదటి పంటకు పుష్కలంగా నీరు లభిస్తుంది. దఫాల వారీగా నీరు వదలినా ఆరు తడులు వీలై, పైరు బ్రతికి పోతుంది. అక్టోబరు, నవంబరు వానలకు మరోకసారి సోమశిల నిండితే రెండవ పంట వీలౌతుంది. పై ఏడాది కరువు పరిస్థితు లేర్పడినా నీటి సమస్య వుండదు.

అయితే ఎందువల్లనో సోమశిల నీటిని కండ్లేరుకు మళ్లిస్తున్నారు. పెన్నార్ డెల్టాకు కేవలం 100 క్యూసెక్కుల నీరు వదలుతుంటే – కండ్లేరుకు 2600 క్యూసెక్కుల నీరు విడుదల చేయడం జరుగు తుంది. కండ్లేరు రిజర్వాయర్ తెలుగు గంగ పథకంలో అంతర్భాగం. పెన్న వరద నీటికి, ఆ రిజర్వాయర్‌కు సంబంధం లేదు. కృష్ణ వరద నీటిని, సోమశిల ద్వారా దానికి మళ్లించడం ఉద్దేశ్యం. అక్కడ నుంచి మద్రాసుకు 15 టిఎంసిల నీరు పంపాలి. ఇప్పుడు కృష్ణ నీరు ఒక్క బొట్టు సోమశిలకు చేరలేదు. అటువంటప్పుడు ఈ నీటిని కండ్లేరుకు అంత భారీ ప్రమాణంలో ప్రవహింప జేయడంలో ఉద్దేశ్య మేమిటి? శ్రీశైలంలో చాలినన్ని నీరు లేవు కాబట్టి, మద్రాసుకు ఇవ్వడానికి రహస్యంగా సోమశిల జలాలను

పన్ని సైదాను తొలగించారని ఆరోపించారు. మంత్రి రమేష్ రెడ్డిపై కూడా వాగ్బాణాలు సంధించారు.

రాను రాను న్యాయ స్థానాలలోని పదవులు రాజకీయంతో కుళ్లి పోతున్నాయి. న్యాయవాదులు ఇట్లా వర్గాలుగా ఏర్పడి వీధిన పడడం సభ్యతగా లేదు.

### ట్యూషన్స్‌పై దర్యాప్తుకు ఆర్‌జెడి రాక

నెల్లూరు కాలేజి లెక్చరర్స్ ట్యూషన్ల వ్యాపారంపై ఎబివిపి ప్రారంభించిన ఆందోళనను పరిశీలించ డానికి విద్యాశాఖ రీజనల్ జాయింట్ డైరక్టర్ శ్రీ సంగమేశ్వర రావు 7 తేది నెల్లూరు వచ్చారు. సర్వోదయ లెక్చరర్లు కొందరు ఆందోళన చేస్తున్న విద్యార్థులను బెదరిస్తున్నారన్న ఆరోపణపై విచారణ జరిపా రాయన. ఎబివిపి నాయకులు ట్యూషన్లు చెప్పే లెక్చరర్ల జాబితా ఆయనకు అందించారు.

### కొత్త ట్రాఫిక్ సిఐ

నెల్లూరు ట్రాఫిక్ ఇన్స్‌పెక్టర్ శ్రీ బొహెచ్ పృథ్వీనారాయణ బదిలీ

తరలిస్తున్నారా అన్న సందేహం కల్గుతుంది. ఇదే నిజమైతే మాత్రం చాలా అన్యాయం. తెలుగు గంగ కాంట్రాక్టరకు బిల్లులు పే చేయడానికి చంద్రబాబు

> కండ్లేరుకు అన్ని నీళ్ల ఎందుకు పంపుతున్నారు?

ప్రభుత్వం కరుణానిధి నుంచి డబ్బు తీసుకొని, హామీ ప్రకారం మద్రాసుకు నీరివ్వడం కోసమే ఈ జలచోరీ చేస్తున్నారన్న వదంతి ఒకటి విన్పిస్తుంది. జిల్లా మంత్రులు, ఎమ్మెల్యేలు ఈ విషయంలో అప్రమత్తతగా వ్యవహరించ వలసి వుంటుంది. నెల్లూరు రైతాంగాన్ని అన్యాయం చేసి, మద్రాసీయుల గొంతు తడిపే ఆలోచన ప్రభుత్వానికి వుంటే మాత్రం ప్రతిఘటించడం అవసరం.

సోమశిల ప్రాజెక్టును పరిపూర్ణ దశకు తీసుకు వచ్చే విషయంలోనూ రాజకీయ పరమైన ఆందోళన ప్రారంభించాల్సిన సమయం ఆసన్నమైంది. రిజర్వాయర్ నిర్మాణం పూర్తయి చాలా సంవత్సరాలు నడుస్తున్నాయి. కాని ఇప్పటి వరకు భూసేకరణ జరగలేదు. అందువల్ల దాదాపు 70 టిఎంసిల నీరు నిల్వచేసే సామర్థ్యం వున్న రిజర్వాయర్‌ను కేవలం 35 టిఎంసిలకు పరిమితం చేస్తున్నారు. భూసేకరణ జరిగి వుంటే మొన్నటి వానలకే 45 టిఎంసిల నిల్వ అయి వుండేవి. పూర్తి సామర్థ్యం వుంటే – జూలై, ఆగస్ట్ నెలలో, కృష్ణ వరద నీటితో ఒకసారి; అక్టోబరు, నవంబరు నెలలో, పెన్న నీటితో రెండవసారి రిజర్వాయర్ నింపవచ్చు. రెండు ఫిల్లింగ్‌లు జరిగితే – పెన్న, తెలుగు గంగ ఆయకట్టులకు నీటి కొరత తలెత్తదే ఏర్పడదు. కాని డబ్బు లేదనే సాకుతో భూసేకరణను నిరవధికంగా వాయిదా వేస్తున్నారు. ఈ వరద నీటిని వృథాగా సముద్రానికి మరలిస్తున్నారు. నాలుగేళ్ళ క్రితం కేవలం 27కోట్లతో భూసేకరణ పూర్తయి వుండేది. ఇప్పుడు గడప ' జిల్లా ప్రాంతంలో మునక డబ్బు కోసం ఆయా గ్రామస్తులు విచ్చలవిడిగా ఇళ్ళు వేయడం వల్ల, డెబ్బయ్, ఎనభై కోట్లు లేనిదే భూసేకరణ పూర్తికాని పరిస్థితి ఏర్పడింది. ఇప్పటికైనా ప్రభుత్వం తొందరపడి ఈ సమస్య పరిష్కరించకుంటే సోమశిల ప్రయోజనాలు నెల్లూరు రైతాంగానికి సిద్ధించవు. జిల్లా నాయకులు, రైతులు సరియైన విధంగా ఆలోచించవలసిన సమస్య ఇది.

ఆయ్యారు. ఆయన స్థానంలో విజిలెన్స్ ఎన్‌ఫోర్స్‌మెంట్ సిఐ శ్రీ హనుమంత రావు నియమితులైనారు.

నెల్లూరు ట్రాఫిక్ చిక్కు ముడులు విప్పడానికి పృథ్వీనారాయణ గారు చాలా కష్టపడ్డారు కాని – అవి ఆయనకు కొరుకుడు పడలేదు.

### మరణాలు

రిటైర్డ్ డిప్యూటీ కలెక్టరు, సౌమ్యుడు, రెవిన్యూ విషయాలలో అపార పాండిత్యం కల్గిన అధికారి శ్రీ పి.వి. సుబ్బారెడ్డి 8 తేది పరమ పదించారు. ఆయన వయస్సు 72 సంవత్సరాలు; భార్య, ఇద్దరు కుమార్తెలు వున్నారు. మరణించే వరకు ఆరోగ్యంగా తిరుగుతూ వుండినా రాయన. అదృష్టం కదా అది!

* * *

విఆర్ హైస్కూలు సైన్స్ టీచర్ శ్రీ పి. సుబ్రహ్మణ్యం (80) 8 తేది మరణించారు. ఆయనకు భార్య, ఐదుగురు కుమారులు, ఇద్దరు, కుమార్తెలు వున్నారు. డాక్టర్ పిఎస్ఆర్‌కె మూర్తి ఆయన కుమారులలో ఒకరు.

పై కుటుంబాల వారికి మా సానుభూతి.



### ప్రకటన

వాకా బాలకోటారెడ్డి అను నేను యావన్మందికి తెలియచేయడమేమనగా నేను; కొంత మంది స్వార్థపరుల మాయ మాటలు విని చేయరాని పనులెన్నో చేసినాను. తరువాత నా తప్పులు నేను తెలుసుకొని ఈ క్రింది విధముగా తెలియచేయు చున్నాను. నేను 3.5.94 తేదీన వి.రాఘయ్య పేరిట రూ49900/- లకు D.D తీసియిచ్చి దానికి మారుగా ప్రాంసరి నోటు వ్రాయించుకొనినట్లు కల్పించి 7.5.96 తేది ఒకటి, 12.6.96న మరొకటి లాయరు నోటీసులు పంపించినాను. కానీ వాస్తవంగా 3.5.94న మద్రాసు వాస్తవ్యులు రావి ప్రసాద్‌గారు, నేను అనగా వాకా బాలకోటారెడ్డి, వడ్డినేని సాయికృష్ణ ప్రసాద్, వట్టూరు రామలింగయ్య అనే మా ముగ్గురి ద్వారా డబ్బు యిచ్చి వి.రాఘయ్య, డి.సంజీవయ్య గార్ల పేరిట ఒక్కొక్కటి రూ 49900/-లు వంతున D.Dలు తీసుకొని రమ్మని మాద్వారా యిచ్చి పంపినందుకు మేము వారి పేరిట D.Dలు తీసినామేగానీ వాస్తవముగా ఆ డబ్బుకు నాకు ఎలాంటి సంబంధము లేదు. పైన తెలియపరచిన నోటీసులు యివ్వటము గానీ, ప్రాంసరి నోట్లు పుట్టించటముగానీ వాస్తవం కాదు. కొంతమంది, నా శ్రేయోభిలాషులు నేను చేసినది తప్పని నన్ను మందలించిన మీదట నా తప్పును నేను తెలుసుకొని పత్రికా ముఖముగా ఈ ప్రకటన యిస్తూ నన్ను క్షమించమని సదరు రాఘయ్యగారిని, కోరుతున్నాను.

ఇట్లు,
**వి. బాలకోటారెడ్డి,**
పోస్టల్‌కాలని, 3వ వీధి,
నెల్లూరు-524004.

# సణుగుడు

* ప్రధాన మంత్రంతటివాడ్ని ఫోర్‌ట్వంటీ అని పిలవడం న్యాయమా?
* చివరకు తెలుగు తీర్థమే సేవించాడు ఎన్సి!

తాను తవ్విన గోతిలో తానే పడతాడన్న సామెత పివి నరసింహా రావు గారి విషయంలో అక్షరాలా రుజువైంది. సివిల దర్యాప్తు వివేచకలను, న్యాయస్థానాలను పావులుగా వాడుకొని తన రాజకీయ ప్రత్యర్థు లందరికీ శ్రీ కృష్ణ జన్మస్థాన ప్రాప్తింప జేసిన నరసింహా రావుగారు ఇప్పుడు అదే చదరంగంలో చిక్కుకు పోయారు.

ఫోర్‌ట్వంటీ అనే పదం ఎంత చవకబారు, మలకన ప్రాయ వ్యక్తుల విషయంలో ప్రయోగింప బడుతుందో అందరికీ తెలిసిన విషయమే. వీధుల్లో అడ్డాలు తిరుగుతూ, చిల్లర మోసాలు చేసే బడుద్దాయిలను ఫోర్‌ట్వంటీ గాళ్లని పిలుస్తుంటారు. న్యాయ పరిభాషే కాదు

## డోలేంద్ర

– అసలు అక్షరం ముక్క చదవడం చేత కానివారికి కూడా ఫోర్ ట్వంటీ సెక్షన్ ఏ నేరానికి అన్వయించేదీ తెలుసు. అటువంటి హీనమైన సెక్షన్ క్రింద పివి నరసింహా రావు గారు ఇప్పుడు నిందారోపణ ఎదుర్కొంటున్నారు. అత్యంత బాధాకరమైన విషయమిది. ఇంత పెద్ద దేశానికి ఐదేళ్లపాటు ప్రధాన మంత్రిగా వ్యవహరించిన నాయకుడు; మేధావిగా, రాజనీతిజ్ఞుడిగా, బహుభాషా కోవిదుడుగా, అపర చాణుక్యుడిగా ప్రపంచ మంతటి నుంచి ప్రశంస లందుకొన్న విజ్ఞాన ఖని; యాభై ఏళ్ల ప్రజా జీవితంలో ఎవరూ వేలెత్తి చూపలేని ఆదర్శప్రాయ నడవడిక కల్గిన విశిష్ట వ్యక్తి జీవిత చరమాంకంలో సాధారణ నేరస్తుడిగా, మోసగాడిగా, కుట్రదారుడిగా కోర్టుబోను ఎక్కవలసి రావడం కంటే దురదృష్టం మరొకటి వుండదు.

పార్లమెంట్ ఎన్నికల ముందు వరకు – అంటే కేవలం మూడు నెలల క్రితం వరకు పివి నరసింహా రావు గారిని భారతీయ ప్రజానీకం అవినీతిపై అస్త్రశస్త్రాలు సంధించిన యోధుడిగా కీర్తించింది. హవాలా వంటి కుంభకోణాల విషయంలో ఎంతటి వారినీ వదలకుండా నిర్దాక్షిణ్యంగా చట్టం చట్రంలో ఇరికించారని ప్రశంసించింది. ఇప్పుడు అదే ప్రజ ఆయన్ను నిరసిస్తుంది; దేశాన్ని కొల్లగొట్టిన, జన విశ్వాసాన్ని వంచించిన హీనుడిగా ఈసడించు కొంటున్నది. ఎంతలో ఎంత మార్పు?

పివి నరసింహా రావుగారు తన నిజాయితీని, నిష్కళంక చరిత్రను రుజువు చేసుకోవ డానికి ధైర్యంగా సమస్యను ఎదుర్కొనే బదులు, చవకబారు లిటిగెంట్ వలె కోర్టు సమస్యను తప్పించు కోవడానికి న్యాయ గ్రంథాలలోని సున్నాలను వెతకడం అత్యంత విచారకరం. జార్ఖండ్ ముక్తి మోర్చా కేసులోనే ఆయన చట్టానికి సహకరించి, సిబిఐ దర్యాప్తుకు సిద్ధపడి వుండ వలసింది; తనపై ఎఫ్‌ఐఆర్ దాఖలు చేసే తప్పు ఛార్జిషీట్ పెట్టుబడిదన్న లాపాయింటు లాగి మొండిగా న్యాయ పరీక్షను తిరస్కరించారు. యూరియా స్కాంలో తన కుమారుడు కీలక పాత్రధారి అని నిరూపితమై నప్పుడే నైతిక బాధ్యత స్వీకరించి వుండ వలసింది; కాని తన కొడుకు తనకు సంబంధం లేదనే పిడివాదంతో విమర్శలను త్రిప్పి కొట్టారు. సెయింట్ కిట్స్ ఫోర్జరీ నేరారోపణలో తన ప్రమేయం న్యాయస్థానాలలో చర్చకు వచ్చినప్పుడే తన నిర్దోషిత్వం రుజువు చేసుకొనడానికి ప్రయత్నించి వుండ వలసింది; కాని ఆ నింద తనకు విన్పడనట్లే బధిరత్వం నటించారు; ఇప్పుడు సాక్షాత్తు ఒక న్యాయమూర్తి తనను దోషిగా పేర్కొంటూ విచారణకు రమ్మని ఆదేశిస్తే – న్యాయ గ్రంథాలు వెతికి, తప్పించు కోవడానికి మార్గాలు అన్వేషిస్తున్నారు. మాధవరావు సింధియా – వంటి నిష్కళంకులను హవాలా బూచి చూపి పదవుల నుంచి తొలగించడంతో పాటు పార్టీ టిక్కెట్లు కూడా నిరాకరించిన ఆయన అన్ని కేసుల్లో ఇరుక్కొన్న తర్వాత కూడా, ఇంతగా జనధిక్కారం భరిస్తూ కూడా, పదవుల చూరుపట్టుకు వ్రేలాడడం చాలా అవమానకర హీన వైఖరి అన్పించు కొంటున్నది. ఉన్నత స్థానాలలో వుండేవారు తమపై నేరారోపణలు వచ్చినప్పుడు తమంతట తాముగా చట్టం ముందు నిలబడి సవాల్ ఎదుర్కోవడం గౌరవ ప్రద సాంప్రదాయం. తన పలుకుబడితో, తన మేధస్సుతో తన నేరాలను కప్పి పెట్టుకోవాలని ప్రయత్నిస్తే – ఒక సాధారణ క్రిమినల్‌కు ఆయనకు తేడా ఏమి వుంటుంది?

ఈ సందర్భంగా న్యాయస్థానాల వైఖరి విచిత్రంగా వుంది. చిన్న, పెద్ద న్యాయ మూర్తు లందరూ వెనుక ముందు ఆలోచించ కుండా రాజకీయవాదులపై కఠోర వ్యాఖ్యలు చేస్తున్నారు; కఠినమైన ఉత్తర్వులు జారీ చేస్తున్నారు. చట్టపరంగా తమకు లభించిన స్వేచ్ఛను, అధికారాన్ని వినియోగించడంలో న్యాయమూర్తులు ఆవేశానికి లోనౌతున్నారని, తొందరపాటుగా ప్రవర్తిస్తున్నారని భావించ వలసి వస్తుంది. ఇప్పటి కేసులో ఢిల్లీ మెజిస్ట్రేట్ రాజకీయ వాదులపై చేసిన వ్యాఖ్యలు, విమర్శలు అత్యంత తీవ్రమైనవి. కేసు పరిధి దాటి వ్యాఖ్యానించా రాయన. వ్యవస్థపై వ్యాఖ్యానం చేయగల అధికారం ఒక న్యాయమూర్తిగా ఆయనకు వుందా అన్నది ప్రశ్న. లఖూభాయ్ పాఠక్ ఒక ఫిర్యాదు దారుడు మాత్రమే; ఆయన నేరారోపణ ఇంకా నిర్ధారణ కాలేదు. విచారణ సమయంలో ఆయన చేసిన ఆరోపణల నిజానిజాలు రుజువు కావలసిన అవసరం వుంది. అదీగాక 13 సంవత్సరాల తర్వాత, ఒక సంభాషణను ప్రస్తావించా రాయన. అది నిజమో, కాదో తెలియదు. ఈ లోగానే న్యాయమూర్తి తొందర పడిపోయారు.

హవాలా కుంభకోణం వెలికి వచ్చిన నాటి నుంచి న్యాయస్థానాల వ్యాఖ్యాన వల్ల దేశంలో రాజకీయ నాయకుల పట్ల జనంలో చాలా చులకన భావా లేర్పడు తున్నాయి. రాజకీయ వాది అంటే అవినీతి పరుడని, దేశద్రోహని ప్రజలు భావించే వాతావరణం ఏర్పడు తున్నది. ఎవరి మీద ఏ ఆరోపణ వచ్చినా వెంటనే దాన్ని నిజమని నమ్మేస్తున్నారు. రాజకీయ వ్యవస్థ పట్ల ఇటువంటి అవిశ్వాసం ఏర్పడడం ప్రజాస్వామ్య పరిరక్షణకు చాలా ప్రమాదం. న్యాయ స్థానాలు నేర నిర్ధారణ సమయంలో చేయవలసిన వ్యాఖ్యలు, నేరారోపణ దశలోనే చేయడం వల్ల ఈ విపత్తు వాటిల్లు తున్నది. వారు నిగ్రహం పాటించేటట్లు చూడవలసిన అవసరం వుంది.

ఏది ఏమైనా పివి నరసింహా రావు గారు ఆంధ్రులు గర్వించ దగిన వ్యక్తిగా ఇంత కాలం భావించాం; ఆయన ఆంధ్రుడైనందుకు సిగ్గుపడాల్సిన దుస్థితి దాపురించక ముందే – పదవుల నుంచి తప్పుకొని, న్యాయ పరీక్షకు తలవొగ్గి, తన నిష్కళంకత్వాన్ని నిరూపించు కొంటే అందరూ అభినందిస్తారు.

***

నల్లపురెడ్డి కుటుంబ రాజకీయ భీష్మ పితామహుడు. వృద్ధ దశలో వ్యర్థుడనే తృణీకార భావం సహించ లేక ఏడాదిపైనుంచి దోనులో ముసలి సింహం వలె కోటలో అసహనంగా పచార్లు చేస్తుండిన ఎన్టీఆర్ తెలుగు నాయకుడు శ్రీ నల్లపురెడ్డి చంద్రశేఖరరెడ్డి చిట్ట చివరకు చంద్ర శరణు వేడారు. గత వారంలో ఆయన హైదరాబాద్‌కు వెళ్లి, ముఖ్యమంత్రిని కలిసి, అనుచర సమేతంగా తెలుగు తీర్థం సేవించారు.

పాపం పెద్దాయనకు ఈ పాత చేరిక సుతరామూ ఇష్టం లేదు. ఇప్పటికే అందులో ప్రసన్న దూరిపోయి వున్నాడు. వయస్సులో తనే చిన్న అనేకాని, రాజకీయ స్వార్థంలో ప్రసన్న చాలా పెద్దవాడు. అవసర సమయంలో అంత పెదనాన్నను లోడు వుంచుకొని, ఆపత్కాలంలో చెప్ప పెట్టకుండా తానొక్కడే చంద్రబాబు పాదసేవకు తరలిపోయిన వాడు ప్రసన్న. అందువల్ల ఇప్పుడక్కడికి తానువెళ్ళి చేసేదేమి వుండదని; తన గతి పట్టించు కొనేవారెవరూ వుండరని భావించి; కాంగ్రెస్‌లో ఆశ్రయం పొందాలను కొన్నారు. సిగ్గువిడచి, కాంగ్రెస్ తలుపు తట్టారు కూడా! కాని అవలి నుంచి పిలుపు రాలేదు. వాకిట్లో ఎంత సేపని ఎదురు చూస్తారు పాపం! అందుకే ఈ నిర్ణయం తీసుకొన్నట్లున్నారు.

జిల్లా రాజకీయాల్లో ఎన్సికి ఒక ప్రత్యేక స్థానం వుంది. ఆనం కుటుంబ ప్రాభవాన్ని, ఏక ఛత్రాధిపత్యాన్ని ధిక్కరించి ; ఆ జిల్లాలో వారికి ధీమాగా రెండవ రాజకీయ కుటుంబాన్ని తీర్చిదిద్దిన వాడు ఎన్సి. జిల్లా చరిత్రలో ఆ గుర్తింపు, గౌరవం ఆయనకెప్పుడూ లభిస్తాయి. ఆయనలో ఎంతటి సాహసం వుందో, అంతటి చపల చిత్తమూ వుంది. అందువల్లనే జిల్లా దాటి రాణించలేక పోయారు; తన కంటే తన తమ్ముడు రాజకీయ ఔన్నత్యం సాధించినా, చూస్తూ వుండిపోయారు. ఆయన ఆలోచనలు, రాజకీయ వ్యూహాలు కోట పరిధి దాటవు. అదే లోకం, అదే ధ్యాస, అదే తపన. కొంచెం విశాల దృక్పథం అలవర్చుకొని, నిలకడతనం సాధించి వుంటే కాంగ్రెస్‌లో లేదా తెలుగుదేశంలో ఆయన స్థానం పదిలంగా వుండి వుండేది. పై పదవులు వచ్చి వుండేవి. రాష్ట్ర రాజకీయాలను అంచనావేయలేని అమాయకత్వం, చపలచిత్తం ఫలితంగానే ఆయనకీనాటి దుర్గతి.

ఈ పెద్ద వయస్సులో రాజకీయ ఆరాటం వదిలేసి, పిల్ల మనుమలకు మాటసాయం చేస్తూ గడిపివుంటే ఆయనకు ఎంత గౌరవం? పార్టీ మారాడనే అప్రతిష్ఠ ఇప్పుడు కొని తెచ్చుకోవడం విజ్ఞతగా వుందా? అయినా ఆయనకు చెప్పేంత వయస్సు, అనుభవం నాకెక్కడున్నాయి లెండి!

## తెలుగుదేశం

1వ పేజీ కొరవ

ఈ నిజం దాచిపెట్టి, కర్ణాటక కృష్ణ నీటిని అదనంగా వాడుకోదని దేవగౌడ హామీ ఇచ్చినట్లు ప్రకటించడం చంద్రబాబు చేస్తున్న తప్పిదం. ఇది రైతులను దగా చేయడమే. రాజకీయ మొగమాటాలతో ఆయన దేవగౌడను ధిక్కరించ లేక సర్దుక పోతున్నట్లున్నా రాయన. కాంగ్రెస్ పార్టీ ఒక్కటే ఈ విషయంలో రైతుకు న్యాయం చేసే బాధ్యత స్వీకరించాలి. సిఎల్‌పి నేత శ్రీ పి. జనార్దన రెడ్డి ఆ కృషిలోనే నిమగ్నమై వున్నారు. మొన్న 9 తేది కాంగ్రెస్ ఎమ్మెల్యే లందరినీ పిల్చి, పరిస్థితి వివరించి, పార్లమెంటులో దేవగౌడను నిలదీయమని విజ్ఞప్తి చేశారు. రైతు లందరూ సమైక్యమై ఈ విషయంలో ఉద్యమం లేవదీయడం చాలా అవసరం.

## కావలి

2వ పేజీ కొరవ

కేంద్రాల్లోని ఉద్యోగులు తమ కుటుంబాలు బంధు, మిత్రులతో షిర్డీ యాత్ర చేసి వచ్చారు. పేరుకు ఒకటి రెండు యాత్రలే చూపించినప్పటికీ, పూనా, ఔరంగాబాదు, ఎల్లోరా గృహాల వంటి చూడ చక్కని ప్రదేశాలను చూసి వచ్చారు. ప్రభుత్వ సొమ్మును తమ సరదా యాత్ర కోసం జల్సాగా వెచ్చించి తిరిగి వచ్చారు. ఈ విషయాన్ని ప్రశ్నించే వున్నతాధికారులే లేరా?

### వింజమూరు మాగుంట కాలేజి ఫలితాలు

వింజమూరు లోని మాగుంట రాఘవరెడ్డి ఛారిటబుల్ ట్రస్ట్ డిగ్రీ కళాశాల ఈ ఏడాది మంచి ఫలితాలు సాధించింది. 43మంది పరీక్షలకు హాజరైతే, అందులో ఇద్దరు డిస్టింక్షన్, 23మంది ప్రథమ శ్రేణి, 6మంది ద్వితీయ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. కళాశాల నుంచి ఇదే మొదటిబ్యాచ్ అని ప్రిన్సిపాల్ శ్రీ బండి.సుబ్బారెడ్డి తెలియ జేస్తున్నారు.

## కరెంట్

1వ పేజీ కొరవ

వానాకాలంలో సైతం పూర్తిగా థర్మల్ విద్యుత్ కేంద్రాలపై ఆధారపడ వలసి రావడం ఇది వరకెప్పుడూ జరగలేదు. ఇంకొక ప్రక్క థర్మల్ విద్యుత్ కేంద్రాల విస్తరణ జరగడం లేదు. రామగుండం, విజయవాడ థర్మల్ కేంద్రాలు మాత్రమే మొత్తం రాష్ట్రానికి విద్యుత్ నివ్వడం అసాధ్యం. కడప జిల్లా ముద్దనూరు కేంద్రం ఇంకా బాలారిష్టాలతో సతమతమౌతూ వుంది. అటు ఎన్టీఆర్, కాంగ్రెస్, ఇటు చంద్ర బాబు ప్రభుత్వాలు గత పద్నాలుగేళ్ల నుంచి కొత్త థర్మల్ కేంద్రాల స్థాపనలో సరైన నిర్ణయం తీసుకో లేక పోతున్నాయి. విశాఖ పట్నం, కృష్ణపట్నం విద్యుత్ కర్మాగారాల విషయంలో మనసుపెట్టి నిర్ణయం చేసి వుంటే ఈపాటికి రెండు వేల మెగా వాట్ల విద్యుత్ ఆంధ్రలో వెలుగులు చిమ్మి వుండేది. దురదృష్టవశాత్తు ఇప్పటికీ ఒక అవగాహనకు రాలేక పోతున్నారు. ప్రమోటర్లతో ముడుపుల బేరం తెగక కొంత కాలం; అనుమతి ఇస్తే ప్రతిపక్షాలు విమర్శిస్తాయనే భయంతో మరి కొంత కాలం ముఖ్య మంత్రు లందరూ వరుస బెట్టి ఈ ఫైలును ప్రక్కన పడేస్తున్నారు. ప్రభుత్వాధి నేతలలో నిజాయితీ లేకపోవడమే దీనికి కారణం. డబ్బు తీసుకోవాలన్న ఆశ, తీసుకొంటే తెలిసి పోతుందనే భయం, తీసుకోకుండా అనుమతి ఇవ్వడానికి మనసు ఒప్పుకోక పోవడం ముఖ్య మంత్రులను వేధిస్తున్న సమస్య. ఇందులో వారు, వీరనే మినహాయింపే లేదు. అన్నీ ఒకే తానులోని కోకలే!

ముఖ్య మంత్రుల అవినీతి కక్కుర్తికి, సంకుచిత మనస్తత్వానికి, రాజకీయ దివాలా కోరుతనానికి ఆంధ్ర రాష్ట్రం యావత్తూ అంధకారంలో అలమటించ వలసి వస్తున్నది. కనీసం ఇప్పుడైనా ఈ రెండు ప్రాజెక్టులనూ క్లియర్ చేస్తే – రెండు వేల సంవత్సరానికి కరెంట్ కరువు తీరుతుంది. ఇట్నే పెండింగ్ పెట్టుకొంటూ వెళ్తే నూతన శతాబ్దం లోనూ చీకట్లో తడుము లాడుకోవలసి వుంటుంది.

నిజానికి రాష్ట్రంలో ఇప్పుడు జరుగుతున్న వ్యవసాయ, పారిశ్రామికా భివృద్ధి; పెరుగుతున్న జనాభా అవసరాలతో పోలిస్తే ఈ రెండు ప్రాజెక్టులూ చాలవు. రానున్న పదేళ్లలో విద్యుత్ డిమాండ్ రెట్టింపౌ తుందని అంచనా. దాని ప్రకారం ఇప్పుడు రాష్ట్రంలోని ప్రాజెక్టులన్నీ కలిసి ఉత్పత్తి చేస్తున్న విద్యుత్‌కి ఒకటిన్నర రెట్లు అదనంగా ఉత్పత్తి చేయాలి. కనీసం 10 వేల మెగా వాట్ల సామర్థ్యం కల్గిన కేంద్రాలు స్థాపించాలి. ఇప్పటి నుంచి ప్రయత్నం జరిగితే కాని అవి అప్పటికి పూర్తి కావు. కాని ప్రభుత్వ స్థాయిలో ఆ సీరియస్‌నెస్ కన్పించడం లేదు.

డీజల్, నాఫ్తా, సహజ వాయువులతో పాటు అణుశక్తి తోనూ విద్యుత్‌ను ఉత్పత్తి చేసేందుకు రాష్ట్రంలో వసతు లున్నాయి. వాటన్నింటినీ అన్వేషించి, అనుమతులు ఇచ్చి, ప్రైవేటు రంగాన్ని ప్రోత్సహిస్తే పదేళ్లలో సమస్య పరిష్కారం అవుతుంది. లేకుంటే ఆంధ్ర దేశంలో కరెంట్ అన్నమాటే మర్చిపో వలసిన దుర్గతి ఏర్పడుతుంది.

ఈ ఏడాది అవసరాలకు సంబంధించి ఒరిస్సా, మధ్యప్రదేశ్, పశ్చిమ బెంగాల్ ప్రభుత్వాల నుంచి విద్యుత్ కొనుగోలు చేయడం ఒక్కటే మార్గం. కాని ఆయా విద్యుత్ సంస్థలకు పాత బాకీలే చెల్లించలేని పరిస్థితిలో వుంది రాష్ట్ర ప్రభుత్వం. ఆ బాకీ చెల్లిస్తే తప్ప వారు కొత్త కరెంట్ ఇవ్వరు. కనీసం ఇరవై లక్షల యూనిట్లయినా ఒరిస్సా నుంచి తీసుకొంటే తప్ప పట్టణాలు, నగరాలలోనూ పగటి పూట కరెంట్ ఇవ్వడం సాధ్యం కాదని విద్యుత్ బోర్డు అధికారులు తేల్చి చెప్పేశారు.

వానదేముడు కరుణించి, జలాశయాలు నింపితే తప్ప ఈ ఏడాదీ చీకటి సమస్యలు తీరవు.

రమ్యకృష్ణ ఆవేదన

# తండ్రి వంటి వాడితో నాకు లంకె పెట్టడం పాపం!

కన్నాంబ, సావిత్రి వంటి అలనాటి తారలు సెట్‌లో లైటింగ్ ఏర్పాట్లు జరుగుతున్నప్పుడో లేక విరామ సమయంలోనే సెట్ బయట కూర్చొని మౌనంగా ఉండేవారు. లేదా తాము ధరించే పాత్ర పోషణ గురించి ఆలోచిస్తూండేవారు. ఇప్పటి తారలు ఇతరులకు విసుగు కల్గిస్తుందనైనా ఆలోచించ కుండా బఠ బఠా వాగేస్తుంటారు. మచ్చుకి రమ్యకృష్ణ వాదన చూడండి. "డైరెక్టర్ రాఘవేంద్రరావుతో నాకు ముడి పెట్టాయి కొన్ని పత్రికలు. కారణం ఏమై ఉంటుందని ఆలోచించాను. ఆయన చిత్రాల్లో యాక్ట్ చేయడానికి నేను హైదరాబాద్ వెళ్లినపుడల్లా ఆయన గెస్ట్‌హౌస్‌లో బస ఏర్పాటు చేయబడేది. నాకే కాదు; ఆయన చిత్రంలో యాక్ట్ చేస్తున్న మరికొందరు ఆర్టిస్టులకు కూడా అక్కడే బస. ఆయన మాకు గురువు వంటి వారు. డాడీ అని ఆయన్ని సంబోధించినా తప్పులేదనిపించేది. తెలుగులో నేను పాపులర్ అవడానికి ఆయనే ముఖ్య కారకుడంటే కాదనేవారు ఎవరూ లేరు. ఇదండీ పరిస్థితి. ఆయనకు - నాకు లంకె పెట్టారు. ఇలాంటి వదంతులకు నేనేమని సంజాయిషీ ఇచ్చుకునేది? ఇటీవల నేను ఎక్కువగా హిందీ సినిమాలలో చేస్తున్నానా? బొంబాయి పత్రికలు కొ అక్కడి పత్రికల ధోరణిలోనే రాస్తున్నాయి. నేను పైకి వస్తున్నందుకు ఓర్వలేని తారలెవరో ఇలాంటి పుకార్లకు కారకులని ఇప్పుడు నాకు అనిపిస్తోంది. ఆ తారలే పాత్రికేయుల చేత రాయిస్తున్నారని తేట తెల్లమవుతోంది. ఇది సినిమా రంగంలో సహజమని నా గుండె దిటవు పరచుకున్నాను. ఇలాంటి తాటాకు చప్పుళ్ళకు నేను బెదురుతానా?" అన్నది రమ్యకృష్ణ.

## మద్రాసు సినిమావార్తలు

### శివాజీరాజా హీరోగా చిత్రం

శివాజీరాజా ఇటీవల హాస్య నటవర్గంతో కనిపిస్తున్నాడు. 11 ఏళ్ళ తర్వాత మళ్ళీ హీరోగా నటిస్తున్నాడు. శ్రీకర్ ఆర్ట్ ప్రొడక్షన్స్ చిత్రంలో. "కళ్ళు" చిత్రంలాగే ఇందులో హీరోగా నటించినా, హాస్య పాత్రలను మానుకునే ఉద్దేశ్యం లేదన్నాడు. ఇతని ప్రక్కన శుభశ్రీ, నాయిక. కోట శ్రీనివాసరావు, వేలు, బాబూమోహన్, తనికెళ్ళ భరణి, ఎ.వి.ఎస్., ధర్మవరపు సుబ్రహ్మణ్యం, చిట్టిబాబు, అనంత్, ప్రతాని రామకృష్ణ, చందన, జయలలిత, అన్నపూర్ణ ఇతర పాత్రధారులు. మాటలు: యర్రంశెట్టి శాయి. దర్శకత్వం: శివాజీ.

### "కాలాపానీ"

అండమాన్, నికోబార్ దీవుల్లో దేశాంతర శిక్ష విధించబడిన స్వాతంత్ర్య సమర యోధులు అక్కడి 'కాలాపానీ' అనే కారాగారంలో చిత్ర హింసలకు గురి కావడాన్ని చూపే చిత్రమిది. జాతీయ స్థాయిలో నాలుగు అవార్డులు అందుకున్న ఈ అనువాద చిత్రంలో ప్రభు, మోహన్‌లాల్, అమ్రేష్‌పూరి, టాబూ, టిన్నూ ఆనంద్, కొందరు ఆంగ్లేయులు పాల్గొన్నారు. మాటలు: శ్రీరామకృష్ణ. సంగీతం: ఇళయరాజా. దర్శకత్వం: ప్రియదర్శన్ ఆగస్ట్ మొదటి వారంలో విడుదల.

### కృష్ణ, రమేష్ బాబు నటించే జానపదం

కంప్యూటర్ గ్రాఫిక్స్, డిజిటల్ వంటి కొత్త ప్రక్రియలెన్నో నేడు సినిమాలలో ప్రవేశించాయి. ఈ అత్యాధునిక సాంకేతిక సదుపాయాలతో ఒక జానపద చిత్రం తీయడానికి కరుణా ప్రొడక్షన్స్ వారు సన్నాహాలు చేస్తున్నారు. చాలాకాలం తర్వాత కృష్ణ కొడుకు రమేష్‌బాబు నటిస్తున్న ఈ చిత్రంలో రమేష్‌బాబు సరసన రవళి, కస్తూరి నటిస్తారు. కృష్ణ పక్కన ఎవరుంటారనేది త్వరలో తేలుతుంది - దర్శకత్వం: సాగర్.

# ఎన్ని డ్యాన్స్‌లు చేసినా అప్పులు తీరడంలేదు - నిద్ర పట్టడమూ లేదు!

సెట్ బయట సిల్క్‌స్మిత దీర్ఘాలోచనా నిమగ్నురాలై కూర్చొనుంది. నమస్కారం చేస్తూ స్మిత దగ్గరికి వచ్చిన శ్రీలక్ష్మి "ఏమిటి స్మితగారూ! ఏదో ఆలోచనలో ఉన్నట్లున్నారు?" అని పలకరించింది. స్మిత బలంగా నిట్టూర్పు వదులుతూ, "ఏమిటో ఈజీవితం - అంతా సమస్యల వలయం. ఎంతో కాలంగా ఈ ఇండస్ట్రీలో ఉన్నాను. పేరు మాత్రం నిలబెట్టు కోగలిగాను గాని, సంపాదించిన డబ్బును మాత్రం నిలబెట్టుకో లేక పోయాను;అనవసరంగా సొంత చిత్ర నిర్మాణానికి పూనుకున్నాను. అన్నీ తుస్సుమన్నాయి. ఫైనాన్షియర్లకు అప్పు చెల్లించవలసి వచ్చింది. ఇంకా వాళ్ళ బాకీలు తీరలేదు... ఏవేవో ఆలోచనలు. మా ఇంట్లో అయిదు గదులలో స్ప్రింగ్ మంచాలు, వెల్వెట్ పరుపులు ఉన్నాయి. ఎక్కడ పడుతున్నా నాకు రాత్రుళ్ళు సరిగా నిద్ర పట్టడం లేదు. మనసుకు నెమ్మది లేదు. నా ఫాన్స్‌లో మహిళలు ఎక్కువ మంది ఉన్నారు. వాళ్ళ ఊళ్ళో గుడిలోని ప్రసాదాన్ని పంపుతూ, ఇటుపైన చాలీచాలని దుస్తులతో డాన్సులు చేయకండి - అని రాస్తున్నారు.

**సిల్క్ స్మిత ఆవేదన**

ఇటీవల తెనాలి నుంచి వచ్చిన కొందరు మహిళలు స్వయంగా నాతో చెప్పారు కూడా. కాని, నా బాకీలు తీరేవరకు నేను డాన్సులు చేస్తూ డబ్బు సంపాదించుకోవలసిందే కదా? ఈ సలహాలిచ్చే మహిళలు తీరుస్తారా? నా అవస్థలు వాళ్ళకేం తెలుసు?" అని స్మిత భారంగా శ్వాస వదిలింది.

కథ, కథనం, సన్నివేశాలన్నిటిలోనూ పాత కంపు

# బొబ్బిలిబుల్లోడు

బొబ్బిలి గ్రామానికి చెందిన గ్రామ పెద్ద మంచి పలుకుబడితో పెత్తనం చెలాయిస్తుంటాడు. అతని పటాటోపాన్ని చూచి ఓర్వలేని వెంకటరామయ్య (చలపతిరావు) అతడ్ని చంపేస్తాడు. చనిపోయిన గ్రామ పెద్ద పిల్లలు రామం (వినోద్‌కుమార్), శాంతి (శ్రీకాంతి) ఒక బాబాయ్ (బాలయ్య) ఆదరణలో పెరిగి పెద్దవుతారు. తన కళ్ళ ముందు తన తండ్రి ని చంపిన వెంకటరామయ్య మీద రామం మనసులో పగ పెరుగుతూ వుంటుంది.

వెంకటరామయ్యకు చంద్రం (శ్రీహరి), జగదీష్ (రాజకుమార్) అనే

**చిత్రసమీక్ష**
**గిద్దలూరు గోపాలరావు**

ఇద్దరు కుమారు లుంటారు. వెంకటరామయ్య వలె చంద్రం కూడా దుర్మార్గుడు. తన తమ్ముడు జగదీష్‌ని చంపి తన తండ్రి ఆస్తికంతా వారసుడు కావాలనుకుంటాడు. తన కుటుంబానికి శత్రువైన రామంను చంపాలనుకుంటాడు. ఈ రెండు కోరికలూ తీర్చుకొనేందుకు ఫోటోగ్రఫీతో బ్లాక్‌మెయిల్ చేసే నిపుణత కల్గిన గురుమూర్తి (తనికెళ్ళ భరణి) అనే దుష్టుడి సహాయం పొందుతాడు. తన బ్లాక్‌మెయిల్‌కు సహకరించేందుకు సుకుమారి (లతాశ్రీ)ని జత చేసుకుంటాడు గురుమూర్తి. శత్రు కుటుంబాలకు చెందిన శాంతి, జగదీష్‌లు లస్త్రీలో కాలేజీలో చదువుతూ ప్రేమించుకుంటారు. పెళ్ళి చేసుకోవాలనుకుంటారు. అది తెలియని శాంతి అన్న రామం శాంతికి వేరే పెళ్ళి సంబంధం చూస్తాడు. జగదీష్ ఆ పెళ్ళి సంబంధాన్ని చెడగొడతాడు. దాంతో రామం, జగదీష్ కుటుంబాల మధ్య వైరం మరింత పెరుగుతుంది.

చంద్రం ప్రోత్సాహంతో గురుమూర్తి - జగదీష్, సుకుమారిలకు మత్తు మందిచ్చి వారిద్దరినీ ఒక మంచం మీద పండుకోబెట్టి ఫోటోతీస్తాడు. ఆ ఫోటో చూపి జగదీష్ వద్ద డబ్బు గుంజుతాడు. జగదీష్ సుకుమారిలకు సంబంధమని ప్రచారం చేస్తాడు. సుకుమారి హత్య గావించబడుతుంది. ఆ హత్యానేరం జగదీష్ మీదకు నెట్టబడుతుంది. జగదీష్‌కు ఉరిశిక్ష పడుతుంది.

కొరవ 9 పేజీలో

# జ్యోతిలక్ష్మిపై ఇంకా మోహం - జ్యోతిమీనాకు పట్టరాని ఆగ్రహం!

తన కూతురు జ్యోతిమీనాకు ఇటీవల ఒక తెలుగు చిత్రంలో నటించే అవకాశం వస్తే తల్లి జ్యోతిలక్ష్మి ఆమెకు తోడుగా హైదరాబాద్ వెళ్లింది. పలుచోట్ల ఆమెకు అభిమానులు తారసపడి, ఆటోగ్రాఫ్‌లు అడిగారే కాని, జ్యోతిమీనా సంగతి ఎవరూ పట్టించుకోలేదు. అందుకు మీనా చిన్నబుచ్చుకుంది. కుమార్తె ముఖద్యుతులు గమనించిన జ్యోతిలక్ష్మి "పాపా! ఒకప్పుడు డాన్సర్‌గా నేను సంపాదించిన పాపులారిటీకి ఇప్పటికీ నన్ను అభిమానించే వారెందరో ఉన్నారు. నువ్విప్పుడిప్పుడే ఈ రంగంలో ప్రవేశించావు. నిలదొక్కుకోవ డానికి కొంత కాలం పడుతుంది. ఆ తర్వాత నువ్వుకూడా నాలా ప్రకాశిస్తావు. అప్పుడు నీకూ బ్రహ్మరథం పట్టేవారుంటారు. అప్పటికి నేను వాడిపోతాను. నాసంగతి ఎవరూ పట్టించుకునే వారుండరు" అని కుమార్తెను బుజ్జగించింది.

### విజయశాంతి 'హెల్త్ క్లబ్'

"ఆడది అబల కాదు; సబల అని సినిమాలలో నిరూపించాను. జీవితంలో కూడా అంతే అని నిరూపించ బోతున్నాను, "అంది విజయశాంతి. త్వరలోనే ఈమె మద్రాసులో కేవలం మహిళల కోసం ఒక క్లబ్‌ను ప్రారంభించనున్నదట. మహిళలకు దేహ పరిశ్రమ, కరాటే, కుంగ్‌ఫూ వగైరాలలో శిక్షణ ఇవ్వడానికి ఏర్పాటు చేస్తుందట. "నేటి యువతులందరూ నిజ జీవితంలో నాలా కనిపించాలనే తాపత్రయం," అంది విజయశాంతి. ముప్పయ్యో పడిలో పడిన విజయశాంతి బొంబాయి నుంచి దిగుమతి అవుతున్న తారలకు మించిన దాననని నలుగురికి తెలియడానికి చేస్తున్న ప్రయోగాలలో ఇదొకటి.

### "అమ్మో...పోలీసోళ్ళు"

నిజాయితీ గల పోలీసాఫీసర్లను ఇది వరకు చాలా చిత్రాలు చూపించాయి. కాని, టి.కృష్ణ దర్శకత్వం వహిస్తున్న "అమ్మో...పోలీసోళ్ళు" చిత్రం కొంత మంది వ్యక్తులకు - పోలీసులకు మధ్య జరిగిన సంఘర్షణ ఇతివృత్తంగా రూపొందుతుంది.

శివకృష్ణ, భరణి, రామరాజు, బాలయ్య, దేవి, నిలిమ, స్వేచ్ఛ, ఉమాశర్మ, వరలక్ష్మి, గుండు హనుమంతరావు, వల్లభనేని జనార్దన్, ఆడబాల నటవర్గం. మన రాష్ట్రంలో 'ఈనాడు టి.వి, జెమినీ టి.వి' కాక మరో కొత్త శాటిలైట్ టి.వి.ని ప్రవేశపెట్టడానికి కొందరు ధనికులు ప్రయత్నాలు మొదలెట్టారు. బాగా ఆడని సినిమాలకు అలాంటి శాటిలైట్ టి.వీలే గతి!

**జమీన్‌రైతు చందాదారులకు మనవి**

జమీన్‌రైతు పత్రిక చందా అందరు చందా దారులకు 31.3.96 తేదితో అయిపోయింది ఆ విషయం కార్డు ద్వారా కూడా తెలిపియున్నాము. 1.4.96 నుండి జరుగు సంవత్సర చందా, మరియు పోయిన సంవత్సరం నిల్వ వున్న వారు దయచేసి వెంటనే చెల్లించి పత్రిక నిర్వహణకు సహాయ పడవలసిందిగా ప్రార్థన.

-మేనేజరు

# శ్రమదానం పేరుతో మంచి రోడ్డును గలీజు చేశారు!

11లక్షల రూపాయలు [illegible] ఎదుతున్నట్లు [illegible] ఈ కార్యక్రమంలో ఎమ్మార్వో [illegible] ఎమ్మెల్యే [illegible] [illegible] పాల్గొన్నారు.

## అనంతసాగరంలో మొక్కుబడిగా శ్రమదానం

అనంతసాగరం మండలంలో శ్రమదాన వారోత్సవాలు మొక్కుబడిగా జరిగాయి. అధికారులు తమ కార్యక్రమాలను ఫోటోల వరకె పరిమితం చేసుకొని చక్కా వెళ్లి పోయారు. రోడ్డు బాగున్న అనంతసాగరం బస్టాండు వద్ద ఒక లోడు ఎర్రమట్టిని తోలి దాన్ని బజారువీధిలో పోసి, ఆప్రాంతమంతా గలీజు చేసి, ఫోటోలు తీసుకొని తమ పని అయ్యిందనిపించారు. గ్రామంలోని గంగ గుంట మంచినీటి పైపు లీకేజి అయ్యి నీరు వృధాగా పోతున్నా దాన్ని [illegible] అధికారులకు [illegible] చిక్కటం లేదు. కాని శ్రమదానమంటూ బాగున్న రోడ్డును పాడుగొట్టి పోయారు.

## గూడూరు మ్యారేజీబ్యూరో గుట్టు రట్టయ్యింది!

గూడూరు టవున్‌లో కుక్కగొడుగుల్లా వెలిసిన మ్యారేజి బ్యూరోల బండారం బట్ట బయలయ్యింది. గూడూరు మెస్సెక్ సెంటర్లో గల సాయిరాం మ్యారేజ్ బ్యూరోపై షాహిద్‌బాషా, నమ్ము దంపతులిచ్చిన ఫిర్యాదు మేరకు సంస్థ నిర్వాహకులను పోలీసులు అరెస్ట్ చేసారు. కలిచేడుకు చెందిన ఈ దంపతు లిద్దరూ పెళ్లికి ముందు ఈ మ్యారేజ్ బ్యూరోకు వెయ్యి రూపాయలు డిపాజిట్‌గా కట్టి సభ్యత్వం పొందారట. మే నెలలో వీరి పెళ్లి జరిగింది. వివాహ సందర్భంగా బ్యూరో వారు క్యాష్

> *జిల్లా వార్తలు*
>
> 2వ పేజీ కొరవ

సర్టిఫికెట్ అంటూ ఒక కాగితం ఇచ్చి, గూడూరు పినాకినీ గ్రామీణ బ్యాంకులో ఎప్పుడు కావాలంటే అప్పుడు వెళ్లి మార్చుకోమన్నారట. కాని అసలా కంపెనీకి బ్యాంకులో ఖాతా లేదని అధికారులు చెప్పడంతో గూడూరు పోలీసులకు ఫిర్యాదు చేశారు. ఎస్.ఐ వెంకట్రామిరెడ్డి బ్యూరో యజమానిని అదుపులోకి తీసుకొన్నారు. జిల్లాలో మ్యారేజ్ బ్యూరోల బండారంపై నమోదైన తొలికేసు ఇదే. ఎస్.పి గారు గారు కూడా జిల్లాలో మ్యారేజ్ బ్యూరోలు 10రోజుల్లో ఎత్తివేసి, జనం వరకు డిపాజిట్ చేసిన డబ్బు తిరిగి ప్రజలకు చెల్లించాలని హెచ్చరిక చేసి వున్నారు. కాని ప్రజలు వేలం వెర్రిగా ఈ బ్యూరోలలో ఇప్పటికే లక్షల రూపాయలు జమ చేసి వున్నారు; అత్యాశగా భావించాలా? అమాయకులని జాలి పడాలా?

## మునిసిపల్ ఆఫీసుపై ఎసిబి దాడి

గూడూరు మునిసిపల్ కార్యాలయంపై 6తేది అవినీతి నిరోధక శాఖాధికారులు దాడి చేసి లంచం తీసుకొంటున్న ఇద్దరు వుద్యోగులను పట్టుకొన్నారు. కుమ్మర వీధిలో నివసించే గోపి చిన్న పనికై వెళ్తె రెవిన్యూ ఇన్స్‌పెక్టర్ చెంచయ్య, రెండు నెలలు తిప్పుకొని 650రూపాయలు లంచం ఇస్తేగాని పనిచేయనన్నారట. దానితో అతనికి కడుపు మండి ఎసిబికి ఫిర్యాదు చేయడంతో వారు వలపన్ని, గోపి చేతికి డబ్బిచ్చి పంపారు. చెంచయ్య ఈ లంచాన్ని డైరక్ట్‌గా తీసుకోక బిల్ కలెక్టర్ వెంకటేశ్వర్లుకు ఇవ్వమనడంతో అతన్ని కూడా ఎసిబి వారు అదుపులోకి తీసుకొన్నారు.

## నాయుడుపేటలో నాణాల ప్రదర్శన

నాయుడుపేటలోని యువ చైతన్య వేదిక 20,21తేదిల్లో జిల్లా స్థాయిలో నాణాలు, తపాలా బిళ్లల ప్రదర్శన ఏర్పాటు చేస్తున్నది. రాజ గోపాలపురం ప్రాథమిక పాఠశాల ఆవరణలో ఈ ప్రదర్శన జరుగుతుంది. తమ వద్ద గల నాణాలు, తపాలా బిళ్లలు ప్రదర్శించగోరే వారు లైబ్రేరియన్, దర్గారోడ్డు, నాయుడుపేటకు ఎంట్రీలు పంపాలి. ప్రదర్శన అనంతరం పాఠశాల విద్యార్థులకు క్విజ్ పోటీ కూడా నిర్వహిస్తారు.

# రాయి - తురాయి

* మానవ మృగాల ఉన్మాదం
* పట్నంగా ఎదిగిన వేదాయపాళెం

పల్లెలు పట్నాలవుతాయని బ్రహ్మంగారు తమ కాల జ్ఞానంలో చెప్పారని అంటారు. అన్నీకాక పోయినా కొన్ని పల్లెలు పట్నాలుగా మారిన వైనం మనం చూస్తూనే ఉన్నాం. అట్లా రూపం మార్చుకొన్న పల్లెల్లో వేదాయపాళెం ఒకటి.

పదేళ్ల నాటి వేదాయ పాళానికి, నేటి వేదాయ పాళానికి పోలికలు లేవు. అప్పుడు రైలు కట్టకు తూర్పున నడి వప్పుడూ లేకుండా పడి ఉన్న కుగ్రామమది. ఇప్పుడు రైలు కట్ట దాటి, నేషనల్ హైవేకి ఇరువైపులా నివాస గృహాలు బారులు తీరి ఉన్నాయి. చిన్నా చితక ఇళ్లతోపాటు నేల నుండి నింగికి నిటారుగా ఎదిగి పోతున్న భవంతులకూ కొదవలేదు.

### అగ్నిమిత్ర

నేషనల్ హైవే అయినందు వల్ల వచ్చే పొయ్యే బస్సులు, లారీలు, కార్లు, ఆటోల వంటి వాహనాల జోరు ఎక్కువైంది. వేదాయపాళెం చాలా [illegible] బస్సులకు టెర్మినస్ కూడ.

జనం రాకపోకలు, ఎడతెరిపి లేని వాహనాల పరుగుల ఫలితంగా ఇది ప్రమాదాలకు నెలవుగా తయారయింది. టౌన్ బస్సుల టెర్మినస్ దగ్గరే ఇప్పటికి చాలా యాక్సిడెంట్లు జరిగాయి. స్కూళ్లు పెరిగినందు వల్ల విద్యార్థులు రావడం పోవడం తప్పదు. యాక్సిడెంట్లలో మృతులైన వాళ్లు ఒకరిద్దరు విద్యార్థులు కావడం గమనార్హం.

బైపాస్ రోడ్డు ఉన్నా లారీ డ్రైవర్లు అటు పోవడంలేదు. హైవేలోనే హైస్పీడులో వచ్చేస్తున్నారు.

దీనితో అంత పెద్ద రోడ్డూ ఇరుకై పోయింది. గతుకులు - గుంటల మయంగా వుంది. అయినా టౌన్ బస్సుల డ్రైవర్లకు మన్ను మిన్ను తెలియడం లేదు. బస్సును జంప్ చేయించి తెచ్చి రోడ్డు మీద పెడతారు. ముందు చూపు, వెనక చూపు ఉండదు.

రోడ్డు భవనాల శాఖ ఇంజనీర్లు శ్రమ అనుకోకుండా వేదాయపాళెం సెంటరుకు వచ్చి పరికించి, రోడ్డు లెవలు బస్ టెర్మినస్ లెవలు పెంచి కాంక్రీటు చెయ్యాలి. ఒక ట్రాఫిక్ ఐలెండు కూడా నిర్మిస్తే ట్రాఫిక్ చాలా వరకు క్రమబద్ధం అవుతుంది. ప్రమాదాలు నివారించ వచ్చు. ప్రజా సంక్షేమం దృష్ట్యా ఈ పని ఎంత త్వరగా చేయిస్తే అంత మంచిది.

****

నిద్ర మంచం దిగి పేపరు మొగం చూస్తే - ఏమున్నది గర్వకారణం? ఎక్కడ బట్టినా ఆడకూతుళ్లపై అఘాయిత్యాలు; మానభంగాలు; బలత్కారాలు! స్త్రీల వెంట రేసు కుక్కల్లా వెంటబడి - వలువలు ఊడ్చి, వొళ్లంతా రక్కి, రాకాసి రతిలో తమ రసికతను చాటు కొంటున్న కీచక భ్రాతలు పెచ్చరిల్లి పోతున్నారు.

వీళ్లను రాక్షసులతో పోల్చి చూపడం రాక్షసులకే అవమానం. ఎందుకంటే మన పురాణాల్లో రాక్షసులు స్త్రీలతో బలవద్రతి జరిపిన దాఖలాలు లేవు. వాళ్లు స్త్రీలను చెరబట్టిన మాట నిజమే కాని చెరచలేదు. బతిమలాడి ఒప్పించ డానికి ప్రయత్నించారు. తమ ప్రయత్నంలో భంగపాటు కైనా సిద్ధపడ్డారు తప్ప, శీలభంగానికి పూనుకోలేదు. ఇప్పటి వలె మానవతుల చుట్టూ ఊరకుక్కల్లా మూగి, మొరగలేదు; కరవలేదు.

అందువల్ల నేటి మగధీరులను మానవ రూపంలో ఉన్న మృగాలనాలి. ఈ మృగాల ఉన్మాద వినోదాన్ని వీక్షించి, ఉపేక్షించే మనబోటి వాళ్లను ఏమనాలి?

☆

## చిత్రసమీక్ష

7వ పేజీ కొరవ

జగదీష్‌కు ఉరిశిక్ష పడేందుకు రామం కారణమని చంద్రం ప్రచారం చేసి, శాంతి తన అన్న రామం మీద తిరుగుబాటు చేసేట్టు చేస్తాడు. బొబ్బిలి బుల్లోడుగా పేరు గాంచిన రామం విజృంభించి సుకుమారి హత్య విషయంలో నిజం బైటకు లాగుతాడు. హంతకుడు చంద్రం అని తెలుతుంది. చంద్రానికి ఉరిశిక్ష పడుతుంది. శాంతి, జగదీష్‌లు కలుసుకుంటారు.

మధ్య మధ్యలో పల్లెటూరి పిల్ల రత్తాలు (ఇంద్రజ) బొబ్బిలి బుల్లోడు రామంతో ఆడుతూ, పాడుతూ ప్రేక్షకులకు కనువిందు చేస్తుంటుంది.

జనార్దన మహర్షి వ్రాసిన కథలో కొత్తదనం లేదు. గ్రామకక్షలు, రెండు పెద్ద కుటుంబాల మధ్య విరోధాలు, ఈర్ష్యా, అసూయలతో ఒకరు మరొకరిని చంపటం, విరోధులుగా వుండే కుటుంబంలోని పిల్లలు ప్రేమించు కోవటం, పెళ్ళి చేసుకోవాలను కోవటం, అన్నా చెల్లెళ్ళ అన్యోన్యం, దుష్టుడైన తండ్రికి, దుర్మార్గుడైన కొడుకు అండగా నిలవటం, ఫోటోగ్రఫీతో బ్లాక్‌మెయిలింగ్, ఒకరు చేసిన హత్య మరొకరి మీదకి నెట్టటం, హీరో అసలు నేరస్తుడ్ని పట్టుకోవటం ఇవన్నీ చాలా పాత విషయాలు. వీటికి తెలుగు సినిమా (అవ) లక్షణాలైన డ్యూయిట్లు, ఊహా లోకంలో డాన్సులు, హీరో పది మందిని ఒక్కసారే నేలకరిపించే ఫైటింగులు, హాశ్యాలు, శిక్షలు జోడించి దర్శకుడు కె.రంగారావు "బొబ్బిలి బుల్లోడు" చిత్రం తయారు చేశాడు. ఈ పాత విషయాలను దర్శకుడు కొంత వరకు మంచి మలుపులు తిప్పి చక్కగా మలిచాడు. అన్నా చెల్లెళ్ళ అనురాగం బంధం బలంగా చూపబడింది. అన్నను అపార్థం చేసుకొని నిరాహార దీక్షకు దిగటంతో చెల్లెలు పాత్ర బలహీన పడింది.

ఫైటింగ్‌లు చప్పగా వున్నాయి. సాంకేతిక పరంగా కూడా చిత్రం సన్నగిల్లింది. వినోద్‌కుమార్ నటన, చెల్లెలుపై అనురాగం చూపటం, విరోధులపై పగసాధించటంలో మెరుగ్గావుంది. కొత్త నటి శ్రీకాంతి శాంతి పాత్రలో చక్కగా నటించింది. చలపతిరావు, శ్రీహరి విలనీ మామూలుగా వుంది. రాజకుమార్ పాటల్లో ఆటల్లో చలాకీగా కనిపించాడు. తనికెళ్ళ భరణి బ్లాక్‌మెయిలర్‌గా ఫర్వాలేదు. ఇంద్రజ శృంగారానికి పరిమితమైంది.

రాజ్ ఐదు పాటల్ని స్వరబద్ధం చేశాడు. సంగీతం సాధారణంగా వుంది. "రెప్ప మీద కనుపాప కోపగించె నెందుకో"- అనే సీతారామశాస్త్రి వ్రాసిన పాట సాహిత్య పరంగా చెప్పుకో తగింది. ఈ పాట బాలసుబ్రహ్మణ్యం గాత్రంలో హృద్యంగా సాగింది. ఇలాంటి కొన్ని అంశాల పరంగా, దర్శకత్వ పరంగా, జనార్దన మహర్షి సంభాషణ పరంగా, నటీ నటుల నటనా పరంగా చిత్రంలో కొన్ని దృశ్యాలు రక్తి కట్టాయి.

## శుభస్వీకరణ

మా తండ్రి

### పెళ్ళూరు సుబ్రహ్మణ్యం గారు

8.7.96 తేది పరమపదించినారు. వారి ఆత్మకు చిరశాంతిని కలుగ చేయమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

17.7.96 తేది దశాహస్సు, 20.7.96 తేది శుభస్వీకరణ నెల్లూరు, ట్రంకు రోడ్డులోని తిప్పరాజు వెంకటసుబ్బయ్య సత్రం నందు జరుగును.

బంధు మిత్రులు తెలియ గోరుతాము.

కుమార్తెలు
వెంకట సుబ్బమ్మ
డా. శారద

కుమారులు
వెంకట సుబ్బారావు, సూర్యప్రకాశరావు,
డా. పి.యస్.ఆర్.కె. మూర్తి,
సత్యనారాయణ రావు, చంద్రశేఖర రావు

